# ద్వాదశ జ్యోతిర్లింగ యాత్రాదర్శిని

వినయ్ భూషణ్ వి. ఆర్కే



# ద్వాదశ జ్యోతిర్లింగ యాత్రాదర్శిని

వినయ్ భూషణ్ వి.ఆర్కే
ఏలూరు రోడ్,
విజయవాడ - 520 002.

మొదటి ముద్రణ
జనవరి, 2001

ముద్రణ :
**స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
గాంధీనగర్, విజయవాడ - 3.

డిటిపి :
మోనార్క్ గ్రాఫిక్స్
విజయవాడ-3

ప్రచురణ
**ఋషి ప్రచురణలు**
మెయిన్ రోడ్, హనుమాన్‌పేట,
విజయవాడ - 520 003.
ఫోన్ : 579190, 400023

వెల :
రూ. **18–00**

# ఇందులో....

శ్రీ శివదేవుని మనసాస్మరణ.

లింగ వర్ణన.

జ్యోతిర్లింగ ఉద్భవము.

జ్యోతిర్లింగ క్షేత్ర సంగ్రహచరిత్ర.

జ్యోతిర్లింగ మహాత్మ్యము.

ఆ క్షేత్రములోని విశేషములు.

క్షేత్రదర్శనమునకు మార్గము.

ఆ క్షేత్రములో పరిక్రమము.

శ్రీ శక్తి స్మరణము.

పార్వతీమాత శక్తిలప్రమేయము.

దక్ష పుత్రికమైన పార్వతీమాత యజ్ఞముకు వెళ్లుట.

యజ్ఞములో ప్రాణత్యాగము.

మాత యొక్క మేనితో శ్రీ శివదేవుని సంచారము.

మాత అంశలు స్థిరీకరించిన స్థానములు.

ఆయా క్షేత్ర మహిమలు.

క్షేత్ర విశేషములు.

క్షేత్రదర్శనమునకు మార్గములు.

క్షేత్ర పరిక్రమము.

# మా నూతన ప్రచురణలు

| | | |
|---|---|---|
| కంప్లీట్ కెరీర్ గైడ్ | శ్రీ వాసవ్య | రూ. 180-00 |
| మెడికల్ లాబ్ టెక్నాలజీ | ఎ. వెంకటేశ్వరరావు | రూ. 30-00 |
| వరల్డ్ నెట్ ఇంటర్‌నెట్ | ఎన్. వి. రమణ | రూ. 30-00 |
| మహిళా మార్గదర్శి | ఉషారాణి | రూ. 45-00 |
| మీ జీవిత భాగస్వామిని మీరే ఎంచుకోండి | కె. వి. మోహన్‌రామ్ | రూ. 40-00 |
| హెల్త్ ఫైల్ | అయిదు వైద్య విధానాలతో | రూ. 100-00 |
| అయస్కాంత చికిత్స | శైలేష్ కుమార్ | రూ. 30-00 |
| డాక్టర్ లేని చోట | అయిదు వైద్య విధనాలతో | రూ. 20-00 |
| తులసి | పరమేశ్వర్ | రూ. 15-00 |
| మీ సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు | పరమేశ్వర్ | రూ. 20-00 |
| సర్వరోగ సూక్ష్మ వైద్యము | పరమేశ్వర్ | రూ. 45-00 |
| రేకి | శైలేష్ కుమార్ | రూ. 20-00 |

# ద్వాదశ జ్యోతిర్లింగ యాత్రా దర్శిని


శివదేవుని గురించి వ్రాయటము అంటే అర్థము సముద్రములోని నీటి బిందువులను లెక్కించుటకు ప్రయత్నించుట లేదా ఆకాశములోని నక్షత్రములను లెక్కించుట ఎట్లో అట్లాంటిది. అట్టి అనంత గుణ సంపన్నుడు ఆది అంతము లేనివాడు ఈ బ్రహ్మాండ బాండములలో నిండినవాడు అయిన శ్రీ శివదేవుని ఈ భూగోళము దృష్టి నుండి వీక్షించి ఆయనను మన మహర్షులు, పూర్వులు తమతమ అదృష్టవశమున శ్రీ శివదేవుని ఒక రూపముతో వూహించి దర్శించి, ఆయనను అందరూ సేవించుటకు గాను వీలుగా ఈ భూమిమీద వివిధ ప్రదేశములలో ప్రతిష్ఠించియు- కొన్నిటిని నిర్దేశించియు - కొన్నిటిని తమతమ దివ్యశక్తితో అవలోకించి వాటిని ద్వాదశ జ్యోతిర్లింగములగాను - ఉప జ్యోతిర్లింగములగాను - పంచభూత లింగములు గాను - పంచ ఆరామ లింగముల గాను యింకను తదితర నామములతోను నిర్దేశించి, మానవాళి ఆ లింగ రూపములో నున్న శ్రీ శివదేవుని (ప్రకృతి+పురుషుడు) ఆరాధించి జ్ఞానోదయము పొంది ఆయన కరుణకు పాత్రులగుటకు అవకాశము కల్పించిరి. శ్రీ శివదేవుని ఆరాధన కొరకు నిర్దేశించిన లింగాలయములలో మిక్కిలి ప్రాముఖ్యము పొందినవి జ్యోతిర్లింగములు. ఆ జ్యోతిర్లింగ ఆలయములు భారత దేశములో ఒకే చోటగాకుండా దేశములో నలుమూలలా సాదుర్భవించి భక్తావళికి శ్రమలేకుండా తమతమ నివాసములకు దగ్గరగానుండి వారిచే పూజలు అందుకొనుచు వారికి తృప్తి మరియు మరణానంతర సంతృప్తి యిప్పుడే కల్గించుచున్న ఈ శివాలయములు నదీ తీరములలోను - పర్వతాగ్రములలోను - మహాత్ములు తపస్సు చేసిన స్థానములలోను వెలసియున్నవి. వీటిలో కొన్ని వివిధ రకములైన శిలలతో ఏర్పాటు చేయబడినవి. కొన్నిసాలి గ్రామశిలలతో ఏర్పడి స్వయంభూలుగా ఆరాదించబడుచున్నవి. ప్రతిష్ట లింగములను వివిధ సంప్రోక్షములతో తేజస్సును ఆవాహన చేయుదురు. శ్రీ

శివదేవుని దివ్యతేజస్సును పొంది ఎవరితోను ప్రతిష్ఠాపనము లేకుండా స్వయంగా ఏర్పడిన వాటిని జ్యోతిర్లింగములని నిర్దేశించిరి. ఆ జ్యోతిర్లింగ దర్శన భాగ్యముతో జన్మసాఫల్యము కలుగును. సామాన్యముగా హిందూ అన్న ప్రతివారికి ద్వాదశ జ్యోతిర్లింగాలనన్నిటిని దర్శించుకోవాలని కోరిక వుంటుంది. కనీసము 12 లో కొన్ని అయినా దర్శించుకొని తృప్తి నొందుతారు. అందరికి అన్ని జ్యోతిర్లింగాలను దర్శించుకొను అవకాశముండదు. ధనాభారమువల్లగాని ఆరోగ్య రీత్యాగాని, ప్రయాణ సౌలభ్యలోపమువల్లగాని లేదా ఈ పండ్రెండు జ్యోతిర్లింగములు ఎక్కడెక్కడ వున్నవో వాటిని ఏ మార్గాలద్వారా వెళ్లవలెనో తెలియకగాని పండ్రెండు జ్యోతిర్లింగాలను దర్శించలేకున్నారు.

ఈ జ్యోతిర్లింగాలను కొందరు సరిగా నిర్దేశించక వేరువేరు ప్రదేశములలో నిర్దేశించి భక్తులకు అనుమాన సంకటము కలుగజేయుచున్నారు. ఈ పుస్తకములో మనపురాణములలో నిర్దేశించినటువంటి జ్యోతిర్లింగ ప్రాదుర్భావము - స్థలము స్థలపురాణము - ప్రయాణ సౌలభ్యము రచయిత తన స్వానుభవముతో యితర పుస్తకములలో నున్నటువంటి సమాచారములను క్రోఢీకరించి వ్రాయటము జరిగినది. ఇది అందరికి సమ్మతము అనుకొనుచున్నాను.

శివ లింగములో పానుమట్టము అమ్మవారి అంశగాను లింగము శివదేవుని అంశగాను మన పెద్దలు చెప్పుచున్నారు. ఈ లింగములు అనేక ఆ కారణములలోనున్నవి. అనగా శ్రీ శివదేవుని ప్రత్యేక రూపముగా వర్ణించలేము కారణము ఆయన నిరాకారి. భక్తుడు తనకు అవకాశమున్న, వీలైన రూపమును సృష్టించుకొని (తయారు చేసికొని) యిష్టమైన లేదా వీలైన పదార్ధముతో సేవించును. సామాన్య మానవునికి ఆకారము లేనిదే తనయొక్క భక్తిని నిలుప శక్యము కాదు. అతను కొంతకాలము సాకారమును సేవించి - సేవించి నెమ్మదిగా నిరాకారమును ధ్యానించుకొను శక్తిని పొంది, నిరాకార ధ్యానముతో ఆత్మ సంయమును పొందును. కనుక ప్రతివారు ముందుగా సాకారనునా ధ్యానించుట అలవరచుకున్న కొంతకాలమునకు నిరాకార ధ్యానములోనికి ప్రవేశించగల్గును తమతమ ప్రమేయము లేకుండగనే. శ్రీ శివలింగములను మట్టితోను - రాతితోను - వివిధ లోహములతోను స్ఫటికములతోను తయారు చేయుదురు. ఏ లింగమును తయారు చేసినను ఆ పదార్ధముతోనే పానుమట్టమును చేయవలయును.

ఈ లింగము స్థిరము నుండు నట్లును, కొన్ని చిన్నవిగా నుండి ఎక్కడకు కావలనుకుంటే అక్కడకి తీసికొని వెళ్లునట్లు తయారు చేసికొందురు. స్థిరలింగములను దేవాలయములలోను లేదా ఏదైనా ప్రదేశములో ప్రతిష్టించెదరు. చిన్నవాటిని భక్తులు వారితో పాటు ఎక్కడికైనా తీసికొని వెళ్లెదరు పూజాప్రార్థనా నిమిత్తము.

ఈ 12 జ్యోతిర్లింగములను ఒకే స్తోత్రములో ప్రవచించబడినవి.

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాధంచ - శ్రీశైలేమల్లిఖార్జునం.
ఉజ్జయిన్యంమహాకాలే - ఓంకారేపరమేశ్వరమ్.
కేదారం హిమరత్పృష్టే - ఢాకిన్యాంభీమశంకరం.
వారణాస్యంచ విశ్వేశం - త్రయంబకం గౌతమీతటే
వైద్యనాధంచితాభూమౌ - నాగేశం దారుకావనే
సేతు బందేచరామేశం - ఘుశ్మేశంచ శివాలయే ।

శ్లో॥ ద్వాదశైతాని నామాని - ప్రాతరుత్థాయయః పఠేత్
సర్వపాపవినిర్ముక్తః - సర్వ సిద్ధి ఫలం లభేత్
యం యం కామ మపేక్ష్యేవ - పఠిష్యంతి నరోత్తమాహాః
ప్రాప్స్యంతి కామంతం తంహి - పరత్రేహమునీశ్వరాః

శ్లో॥ యేనిష్కామతయాతాని - పఠిష్యంతి శుభాశయాః
తేషాంచజననీ గర్భే - వాసోనైవ భవిష్యతి
ఏతేషాం పూజనేనైవ - వర్ణనాం దుఃఖనాశనం
ఇహలోకే పరత్రాపి - ముక్తిర్భవతి నిశ్చితమ్ ॥

ఈ పంద్రేండు జ్యోతిర్లింగములను స్మరణము చేయువారు సర్వపాపములను పోగొట్టుకొని అంత్యకాలమున ముక్తుడగును. ఈ జ్యోతిర్లింగ స్తోత్రపఠనము వలన యిహలోక కోర్కెసిద్ధి మరియు పరలోక సుఖములు సిద్ధించును.

ముఖ్యముగా ఈ జ్యోతిర్లింగములలో కొన్నిటిని కులమత విచక్షణ లేకుండా స్వయముగా తాకి ఎవరికి వారే పూజచేసి కొనవచ్చును.

ఎవరికి వారు స్వామినితాకుచూ జన్మసార్ధకత పొందు జ్యోతిర్లింగములు

1) మల్లిఖార్జున లింగము - శ్రీశైలము
2) భీమాశంకర లింగము - భీమాశంకరం
3) ఓంకారేశ్వర-అమలేశ్వర లింగములు - ఓంకారక్షేత్రం
4) నాగేశ్వర లింగం - దారుకావనము
5) మహాకాళ లింగం - ఉజ్జయని
6) బైధ్యనాద లింగము - చితా భూమి
7) శివాలయం ఘృష్ణేష్వరం - ఘృష్ణేశ్వరం.
8) కేదారేశ్వర లింగం - కేదారినాద్
9) విశ్వేశ్వర లింగం - వారణాశి
10) త్రయంబకేశ్వర లింగం - త్రయంబకేశ్వరం

సోమనాద్‌లోని సోమనాధ లింగం - రామేశ్వరములోని రామనాధస్వామి లింగములను మాత్రము సామాన్య భక్తులు తాకుట నవకాశము లేదు. ఈ పండ్రెండు జ్యోతిర్లింగములను ఒకే సంవత్సరములో దర్శనము చేసికొన వలెనన్న పట్టుదల, దీక్ష అన్నిటికన్నా ఎక్కువ భక్తి వున్నచో తప్పక యాత్ర పూర్తిచేసికొన వచ్చును. ఇది శ్రమతో కూడిన పని. అటులచేయవలెనన్న కారులో ప్రయాణము సుఖముగానుండును. ఈ రోజులలో టాక్సీలు ... స్వంత కార్లు ఎక్కువగానున్నవి. కనుక ప్రయాణము చేయవలెనన్న ముగ్గురు లేక నలుగురు డ్రైవరు, మరియు ప్రయాణీకులలో డ్రైవింగ్ తెలిసినవారుండుట మంచిది.

పండ్రెండు జ్యోతిర్లింగములను ఒకే పర్యాయము దర్శనముచేసి కొనవలెనన్నచో అనువైన కాలము. ఏప్రిల్ లో మొదలుపెట్టవలెను. అటులైన ఆఖరున కేదారినాద్ జ్యోతిర్లింగమును దర్శించు **Time** మే నెలలో వచ్చును. మే నెలలో స్వామివారి ఆలయము ఆరు నెలలతరువాత భక్తుల దర్శనార్ధము తెరిచెదరు కనుక అదే అనువైన కాలము.

జ్యోతిర్లింగ దర్శనమునకు వెళ్లువారు ముఖ్యముగా ఈ క్రింద పొందుపరచబడిన సామగ్రిని వెంట తీసికొని వెళ్లుట చాలా ఉపయోగకరము.

1) 4 జతల దుస్తులు (అవసరము అయినచో మనమేవాటిని ఉతుకు కొనునట్లుండుట మంచిది.)
2) ఒక ఉలెను రగ్గు మరియు ఒక దుప్పటి.

3) రెండు టవల్సు.

4) జ్వరము, జలుబు వచ్చినచో వాడు కొనుటకు కావలసిన మందులు.

5) ఒక కెమేరా రెండు లేదా మూడు రీళ్లు.

6) ఒక డైరీ మరియు 1 పెన్ను.

7) ఒక **Monkey cap** మరియు 1 జత గ్లోవ్సు ఒక కాన్వాస్ షూ మరియు జత చెప్పులు.

8) కొంచెముగా నెయ్యి మరియు ఏదైనా యిష్టమయిన పచ్చళ్లు రెండు.

9) చిన్న అద్దము, దువ్వెన మరియు హెయిర్ ఆయిల్ బాటిల్.

10) సరిపడ డబ్బు. అనగా 5 గురు ఒక కారులో ప్రయాణించినచో కనీసము రూ. 15000 కు తక్కువగాకుండా తీసికొని వెళ్లుట మంచిది. ఒకవేళ ధనము తగ్గినచో యింటికి ఫోన్ చేసి డబ్బు తెప్పించుకొనే పొజిషన్‌లో వుండవలెను.

11) మీరు ప్రయాణం చేసే వెహికిల్‌ను బట్టి 5 గురుకంటే ఎక్కువ ప్రయాణించవచ్చును.

12) ప్రయాణసమయములో వీలైనంతరకు వాటర్ బాటిల్స్ కొని త్రాగుట మంచిది.

13) ఒకవేళ టాటాసుమో లాంటి బండిలోనయిన 8 లేదా 9 వరకు ప్రయాణించవచ్చును.

14) ఒకవేళ వంటచేసికొను వుద్దేశమున్న స్టౌవ్ వంట పాత్రలు (వీలైనంతవరకుతక్కువ) గా తీసికొని వెళ్లుట మంచిది. బియ్యము, ఆయిల్, కూరగాయలు అన్నిచోట్లా దొరుకును కాబట్టి ఎక్కడికక్కడ కొనుక్కొని వండుకొనుట మంచిది. లేదా హోటల్ లో భోజనము చేయదలచుకొన్న వాటిని తీసికొని వెళ్లనవుసరములేదు. అందరికి హోటల్‌లో టిఫిన్ మరియు భోజనము అన్నచో చాలా ఖర్చుఅగును.

15) టార్చ్ లైట్స్

16) ఒక ప్లాస్టిక్ మగ్గు (లోటా)

17) బట్టలుతుకు సబ్బు, స్నానము చేయుటకు ఒక సబ్బు

ఈ ప్రయాణము ఆంధ్ర దేశమునకు నడిబొడ్డున వున్న విజయవాడ నగరమునుండి బయలు దేరునట్లు వ్రాయుచున్నాను. ఇది మీకు సౌలభ్యము అని అనుకొందును. శ్రీ జ్యోతిర్లింగ క్షేత్రములను వర్ణించిన క్రమములో దర్శనము చేసికొన వలెనన్న చాలా వ్యయప్రయాసలతో కూడిన పని అందుకని వరుసక్రమము లేకుండా వీలైనంత వరకు దగ్గర మార్గమును సూచించుచూ ప్రయాణమార్గము నిర్దేశించబడినది. అందరూ కార్ మరియు వాన్స్‌లో ప్రయాణము చేయలేరు. గనుక దగ్గర రైలు మార్గము మరియు బస్సు మార్గముకూడ సూచించడమైనది.

# ఓం నమోశ్శివ

విజయవాడ నుండిగాని హైదరాబాదు నుండి గాని బయలుదేరినపుడు ప్రథమముగా శ్రీశైలమహాక్షేత్రము దర్శించుకొనుట ముఖ్యము. ఈ క్షేత్రమునకు ఆంధ్రప్రదేశములో అన్ని ప్రదేశములనుండి బస్సులు గలవు. కనుక ఈ క్షేత్రమునకు కారు మీదగాని బస్సు మీదగాని ప్రయాణించవచ్చును. రైలు మీద అయినచో మార్కాపురము వరకు రైలు మీద వచ్చి అచ్చటి నుండి బస్సులో ప్రయాణించవచ్చును.

ఆంధ్రప్రదేశ్‌లో కర్నూలు జిల్లాలో నల్లమల పర్వత శ్రేణువులలో సముద్ర మట్టానికి షుమారు 460 మీటర్ల ఎత్తులో వేంచేసి యున్న క్షేత్రము శ్రీశైల క్షేత్రము. ఈ క్షేత్రమును గూర్చి స్కాందపురాణములో ప్రస్తావించబడినది. ఈ క్షేత్రానికి నాల్గు ద్వారములున్నవి. తూర్పున త్రిపురాంతకము, వినుకొండ - దోర్నాల మధ్యనవున్నది. దక్షిణమున సిద్దవటము (కడప దగ్గర) పడమర అలంపురము (కర్నూలు హైదరాబాదు రూటులో షుమారు 15 లేదా 20 కి.లో మీటర్లు వద్ద తూర్పునకు వెళ్లవలయును. అచ్చట అలంపురము అని బోర్డువుండును. లేదా ఎవరినైన అడిగినచో చెప్పెదరు) ఉత్తరమున ఉమామహేశ్వరము (హైదరాబాదునుండి శ్రీశైలము వచ్చుదారిలో అచ్చంపేటకు దగ్గరగా వున్నది.)

పూర్వము భక్తులు ఈ నాల్గు ధ్వారక్షేత్రాలలో ఏదైనా క్షేత్రము ధ్వారా శ్రీశైలక్షేత్రానికి శ్రీశ్రీశ్రీ మల్లిఖార్జున శ్రీశ్రీశ్రీ భ్రమరాంబాదేవేరుల దర్శనమై వేంచేయుచుండెడివారు. వీరు కాలినడకన వచ్చుచుండెడివారు. వచ్చినవారు సరాసరి వెళ్లి శ్రీ మల్లిఖార్జున స్వామివారిని దర్శించి చేతులతో తాకి తలను శ్రీవారి లింగానికి తాకించి పునీతులవుతుండెడివారు. కాని యిప్పుడు అన్ని సదుపాయములు వచ్చినవి గనుక భక్తుల క్షేత్రప్రవేశము చేసిన తరువాత ఏదైనా ఒక సత్రములోగాని దేవస్థానము వారి సత్రములలోగాని గెస్టుహౌసులో గాని విడిది చేసి స్నానాలు పూర్తిచేసికొని స్వామి, అమ్మవార్ల దర్శనమునకు వెళ్లుచున్నారు.

స్వామివారు వేంచేసియున్న పర్వతమును శ్రీ పర్వతముగాను - (శ్రీగిరి) కృష్ణానదికి ఇవతల వడ్డున నున్న పర్వతమును విష్ణుగిరిగాను (సున్నిపెంట) కృష్ణానదికి ఆవలనున్న పర్వతమును బ్రహ్మగిరిగాను (ఈగలపెంట) ప్రఖ్యాతి చెందియున్నవి. సున్నిపెంట (విష్ణుగిరి) చిన్న టౌన్‌షిప్ ఇచ్చుట అన్ని వస్తువులు దొరకును. హాస్పిటల్స్, సినిమా హాల్సు, హోటల్స్ మొదలైనవి అన్ని వున్నవి. బ్రహ్మగిరి మాత్రము చిన్నవూరు. ఇక్కడ హైదరాబాద్ వైపు వెళ్లే బస్సులు ఆగును.

శ్రీశైలములో అన్ని కులములవారికి వారివారి కులముల పేరుతో సత్రము నెలకొనివున్నది. భారతదేశములో ఈ విధముగా ఇన్ని కులముల వారికి సత్రములు మరెక్కడాలేవు.

ఈ క్షేత్రములో దర్శించ దగిన ప్రదేశములు

1) శ్రీశ్రీశ్రీ మల్లిఖార్జున స్వామివారి ఆలయము.
2) శ్రీశ్రీశ్రీ భ్రమరాంబా దేవి వారి ఆలయము.
3) సాక్షి గణపతి ఆలయము.
4) బయట వీరభద్రస్వామి (క్షేత్రపాలకుడు)
5) అంకాళమ్మ వారి దేవాలయము. (గ్రామ దేవత)
6) ఫాలధార - పంచదార
7) హాటకేశ్వరము.
8) పంచమఠములు.
9) కైలాస ద్వారము.
10) భీముని కొలను.
11) త్రిఫల వృక్షము మొ॥

1) శ్రీశ్రీశ్రీ మల్లిఖార్జున స్వామి భ్రమరాంబాదేవి వార్ల ఆలయమునకు నాల్గు గోపురములున్నవి. ఆలయ ప్రహరీ గోడ 7 నుండి 8 అడుగుల వెడల్పుతోను షుమారు 20 అడుగుల ఎత్తులోనున్నది. ఆలయము లోపల పూర్వము చాలా గుండములుండెడివి (నీటి బుగ్గలు) కాని యిప్పుడు చాలా వాటిని మూసివేయటము జరిగినది. యిపుడు ముఖ్యముగానున్నవి. మనోహరగుండము మల్లికాగుండము మాత్రము వాడుకలోనున్నది. స్వామివారి పూజా కార్యక్రమములు మనోహర గుండమునుండి తెచ్చిన జలముతోచేయుదురు.

శ్రీమల్లి ఖార్జున స్వామివారి లింగము షుమారు 6 అంగుళములు ఎత్తు 8 అంగుళములు వెడల్పులోసాలిగ్రామశిలలో పానుమట్టముమీద ఒప్పారుచున్నది. స్వామివారిని ఎవరికి వారు తాకి జలముతో అభిషేకము చేసికొనవచ్చును. భక్తులు ఎక్కువగానున్నపుడు అభిషేకము చేయుటకు వీలుపడదు. తాకుటకు మాత్రమే వీలుపడును.

శ్రీ మల్లిఖార్జునస్వామి    శ్రీ భ్రమరాంబాదేవి

ముఖ్యపర్వదినములలో గర్భగుడి లోనికి ప్రవేశముండదు. దూరమునుండి దర్శనము మాత్రమే చేసికొనవలెయును. అప్పుడుమాత్రము శ్రీ స్వామివారికి పూర్తి అలంకారము చేయుదురు. ఆ అలంకారము కన్నులపండుగగా నుండును.

ఆలయ ప్రాంగణములో 5 అడుగుల లోతులో ఎక్కడ తవ్వినను నీరు వుండును. అదే ఆలయము బయట నీరుకావలెనన్న చాలాలోతుగా త్రవ్వవలసి యుండును. శ్రీశ్రీశ్రీ మల్లిఖార్జున స్వామి జ్యోతిర్లింగము ఇప్పుడు వున్న లింగమునకు సరిగ్గా క్రింది భాగమున వున్నది. పూర్వము శ్రీ స్వామివారి దర్శనము కావలెనన్న భూగృహము లోపలికి మెట్లు గుండా వెళ్లి దర్శనము చేసెడివారు. ఆ మెట్లగుండా లోపలికి దిగి దర్శనమునకు ఒకరు లేదా యిద్దరికీ వీలుండెడిది. అదియుగాకుండా పూజా కార్యక్రమములు చేయుటకు వీలుండెడిదికాదు. అందువలన కొన్ని శతాబ్దాల క్రిందట అందరికి దర్శనపూజాది కార్యక్రమములకు వీలుగా ఇప్పటి జ్యోతిర్లింగ ప్రతిష్ట జరిగినది. మీరు జాగ్రత్తగా పరిశీలించిన స్వామి వారికి చేసెడి అభిషేకములో 80 శాతం స్వామివారికి చుట్టూవున్న కాళీధ్వారా క్రిందకి వెళ్లి శ్రీశ్రీశ్రీ మల్లిఖార్జున స్వామికి అభిషేకము జరుగుచున్నది. ఒక్క 20 శాతం లేదా అంతకు తక్కువగా అభిషేకజలము ఆలయము తూముగుండా బయటకు వచ్చుట మనము చూడవచ్చును. కనుక ప్రతివారు అవకాశమున్నంతవరకు జలముతో అభిషేకము చేయుట మంచిది. అందువల్ల అప్పట్లో అందరికి దర్శనము పూజాకార్యక్రమములు నిర్వర్తించుటకుగాను త్రిఫలవృక్షమునకు పడమర దిక్కున

శ్రీ మల్లిఖార్జున లింగ ప్రతిష్ట జరిపినారు. ఆ లింగము యిప్పటి మల్లిఖార్జున లింగమునకంటే ప్రాచీనమైనది. కనుక వృద్ధ మల్లిఖార్జున లింగము అని పిలువబడుచు ప్రాచుర్యము పొందినది.

శ్రీ శివదేవునికి నందీశ్వరునికి మధ్యగా వెళ్లగూడదని పెద్దలు చెప్పారు. కాని శ్రీ మల్లిఖార్జున స్వామి దర్శనము చేయవలెనన్న లైనులో వెళ్లినచో శ్రీ స్వామి వారికి శ్రీ నందీశ్వరునకును మధ్యగా వెళ్లుట తప్పనిసరి. అందువల్ల దీనికి ప్రత్యామ్నాయము ఏమంటే శ్రీ స్వామివారి దర్శనానంతరము శనగల బసవన్న (నందీశ్వరుని) యొక్క పాదములకు నమస్కారము చేసి క్షమాపణకోరవలయును.

అమ్మ శ్రీ భ్రమరాంబాదేవి ఆలయములో కూడ శ్రీ ఆది శంకరాచార్యుల వారు ప్రతిష్ఠాపన చేసిన అంత్రము దృష్టి అమ్మవారి మీదకు - అమ్మవారి దృష్టి అంత్రము మీదకు వుండునట్లు అంత్ర ప్రతిష్ట జరిగినది. కాని ఈ రోజున భక్తులు శ్రీ అమ్మవారికి మరియు శ్రీ అంత్రదేవతకు మధ్యనుండి లైనులో వెళుతూ దర్శనము చేసికొనుచున్నారు. ఇది నా అభిప్రాయములో మంచిపనికాదు. అమ్మవారి దర్శనము సింహ వాహనము దగ్గరనుండి దర్శించినచో ఫలితముండును. అంతేకాని అంత్రదృష్టికి అంతరాయము కల్గించుట మంచిది కాదు. ఇది పూజారులు ఆలోచించి సరిఅయిన యాక్షన్ తీసికొనుట మంచిది. ఇంక వాస్తు గూర్చి యిచ్చట వ్రాయుట మంచిదికాదు. ఆలయప్రాంగణములోనున్న త్రిఫలవృక్షము చాలా పురాతనమైనది. భక్తులు ఆ వృక్షము మొదలులో దీపారాజనలు చేసిచేసిన పిమ్మట అచ్చట కారిన నూనె నెయ్యియొక్క ప్రభావము వల్ల ఆ వృక్షము మరణించుటము సంభవించినది. మరణించునాటికి ఆ మహావృక్షము వయసు 2000 సం॥పైనే వుండును. ఇప్పుడు రావి జువ్వి, మేడి వృక్షములను మరలనాటారు. అది భగవంతుని దయతో మహావృక్షముగా పరిణామము పొందుచున్నది.

ఈ మహావృక్షము క్రింద శ్రీ అగస్త్య మహాముని తపస్సు చేయుచున్నారు ఈ రోజు వరకు. మనము పౌరాణికముగా జూచినను శ్రీ అగస్త్య మహాముని దక్షిణ భారతదేశమునకు శ్రీ శివదేవుని ఆనతినవచ్చి మరల ఉత్తర భారతదేశమునకు వెళ్లలేదు. మరియు శ్రీ అగస్త్యుల వారి భార్య అయిన లోపాముద్రా దేవి మూర్తి (ప్రతిమ) శ్రీ భ్రమరాంబాదేవి వారి ఆలయములో మహాలక్ష్మి, మహా సరస్వతి, మహాకాళీమాతల ప్రక్కగా కొలువైవున్నారు.

శ్రీ లోపాముద్రా దేవి అమ్మవారి విగ్రహము భారతదేశములో ఏ ఆలయములో లేదు. శ్రీ అగస్త్య మహామునివారు నాకు దర్శనము యిచ్చినారు.

ఈ త్రిఫలవృక్షమునకు 13 (పదమూడు) సార్లు ప్రదక్షిణలు చేస్తూ ప్రతిపర్యాయము శ్రీశ్రీశ్రీ మల్లిఖార్జున స్వామివారి ఆలయముపైనున్న త్రిషూలమునకు నమస్కారము చేసినచో మన కోర్కెలు నెరవేరుతావి. ఇది నాస్వానుభవము.

అహోబిళం రాజధానిగా చేసిక ని శ్రీశైల మల్లిఖార్జునస్వామి ఆలయాలను పూజామందిరముగా కృత యుగములో పరిపాలించిన హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడు ఈ క్షేత్రదర్శనము చేసికొనియున్నారు. త్రేతాయుగములో అరణ్యావాసము చేయు సమయమున శ్రీరామచంద్రుడు లక్ష్మణుడు సీతాదేవి శ్రీస్వామి వారి దర్శనార్ధము వేంచేసినారు. ధ్వాపర యుగములో అరణ్యావాసము చేయునపుడు పాండవులు ఈ క్షేత్రదర్శనమునకు వచ్చినారు. కలియుగములో శ్రీ ఆదిశంకరులవారు తమతపః ఫలమును యిచ్చట భక్తులకు ఉపయోగపడుటకు వదిలివెళ్లినారు. వీరుగాక అగస్త్యులవారు విశ్వామిత్రుడు పరశురాముడు అశ్వద్ధామ మొదలగు మహాత్ములేగాక అసంఖ్యాకములైన భక్త సముదాయము ఈ రోజు వరకు దర్శనార్ధము వచ్చి శ్రీ మల్లిఖార్జున భ్రమరాంబా అమ్మవారి ఆశీర్వాదములు పొందుచున్నారు. శ్రీరామచంద్రుడు శ్రీ సీతాదేవి ప్రతిష్టించిన సహస్రలింగమూర్తి లింగములు ఆలయప్రాంగణములో పూజలందుకొనుచున్నవి. అట్లే పాండవులు ప్రతిష్ఠాపిత లింగములు ఆలయ ప్రాంగణములో నుండి పూజలు అందుకొనుచున్నవి.

ఇంకను చూడవలసిన పుణ్యస్థలములు చాలా.వున్నవి. ఈ క్షేత్రమును పాలించెడి స్వామి వీరభద్రస్వామి. ఈ ఆలయము ప్రస్తుతము పోస్టాఫీసు దగ్గరలోనున్నది. అచ్చట బయట బోర్డు వున్నది. స్వామివారి ఆలయమునకు పైకప్పు లేకుండా శ్రీ వీరభద్రస్వామి భద్రకాళీమాతల విగ్రహములు పూజలందుకొనుచున్నవి. ఈయనే ఈ క్షేత్రపాలకుడు. ఈయనను బయట వీరభద్రస్వామిగా పూజించెదరు.

ఈ క్షేత్రానికి గ్రామదేవత శ్రీ అంకాళమ్మ తల్లి ప్రతి క్షేత్రానికి క్షేత్రపాలకుడు మరియు గ్రామదేవత తప్పక ఉండి తీరుతారు. అట్లానే ప్రతివూరికి కూడా వుంటారు. శ్రీశైల క్షేత్రానికి అంకాళమ్మతల్లి గ్రామదేవత. ఆ అమ్మవారి దర్శనము లేకుండా క్షేత్ర పరిక్రమము పూర్తి అవదు. అంకాళమ్మ అమ్మవారి ఆలయము కరిమెల బ్రాహ్మణ సత్రానికి ఇంచుమించు ఎదురుగా ఒక చెట్టు వ్రేళ్ళతో కప్పబడి యుండును. ఆ అమ్మవారి ఆలయదృశ్యము చాలా మనోహరముగా నుండును.

**ఫాలధార - పంచదార :**

శ్రీశైల క్షేత్రమునకు వెళ్ళు దారిలో 4 కిలోమీటర్లు ముందుగా ఫాలధార, పంచదార హాటకేశ్వరమును దర్శనము చేసుకొనవచ్చును. హాటకము అనగా బంగారము కొండలలో కోనలోనూ నుంచి అంతర్ వాహినిగా ఔషధ మొక్కలను తాకుచూ భూమిలోనున్న అన్ని ఖనిజముల మీదుగా ప్రవహించుచూ హాటకేశరములో వేంచేసియున్న శ్రీవారి బంగారు లింగమును తాకుచూ ఫాలధార - పంచధారలుగా ప్రవహించుచున్నది. శ్రీ హాటకేశ్వరస్వామి పూర్వము బంగారు లింగ రూపములో వుండేవారు. అంతర్ వాహినిగా వచ్చు ఔషధ ఖనిజ జలము శ్రీవారి ఫాలమును స్పృశించుచూ అంతర్ వాహినిగా ఐదు ధారలుగా (1) రుద్రధార (2) విష్ణుధార (3) బ్రహ్మధార (4) చంద్రధార (5) శిరిధారలుగా ప్రవహించుచున్నది. ఈ ఫాలధార - పంచధారలో నిష్ఠగా కొంతకాలము స్నానము చేసినచో సర్వరోగములు నివారమగును. శ్రీ ఆదిశంకరాచార్యులుగారు ఈ ఫాలధార - పంచధార వద్ద చాలాకాలము తపస్సు చేసినారు.

**సాక్షిగణపతి :**

ఈ స్వామి ఆలయము ఫాలధార - పంచధారకు 2 కిలోమీటర్ల దూరములో శ్రీశైలము వెళ్ళుదారిలో రోడ్డుకి ఎడమప్రక్కన వేంచేసి యున్నది. ఈ క్షేత్రదర్శనమునకు వచ్చినవారు తప్పక సాక్షిగణపతి స్వామివారిని దర్శనము చేసుకొనవలెను. భక్తులు దర్శనము చేసి మల్లిఖార్జున స్వామిని, అమ్మవారిని సేవించినట్లు శ్రీ గణపతి స్వామియే సాక్షి. అందువలన ఈయనకు సాక్షిగణపతి అని పేరు వచ్చినది.

**పంచ మఠములు :**

ఈ మఠములు భ్రమరాంబ అమ్మవారి ఆలయమునకు వెనుకగా వేంచేసియున్నవి. (1) ఘంటార్క ససిద్ధేశ్వర మఠము (2) విబూధి మఠము (3) రుద్రాక్ష మఠము (4) వీరభద్ర మఠము (5) సారంగేశ్వర మఠము. ఘంటార్క సిద్ధేశ్వర మఠము(ఘంటా మఠము) నకు ప్రక్కనే అద్భుత శిల్ప చాతుర్యముతో షణ్ముఖ (ఆరుముఖములు) గాయత్రీ మాత భారతదేశములో వేంచేసియున్న ఏకైక విగ్రహము. భక్తులు ఆ తల్లి దర్శనము చేసుకొని ధన్యులు అవ్వవలెను. ఈ మఠములలో పూర్వము ఋషులు తపస్సు చేసెడివారు. ఇప్పటికిని కొందరు భక్తులు తపోనిష్టతో వున్నారు. వారిని దర్శించవచ్చును.

**కైలాసద్వారము, భీముని కొలను :**

ఫాలధార - పంచధార నుంచి 2 కిలోమీటర్ల దూరములో అడవి మార్గముననడిచి వెళ్ళినచో కైలాసద్వారము వచ్చును. అక్కడనుండి 11/ 2 కిలోమీటర్ నుండి 2 కిలోమీటరు వరకు ముందుకు పర్వతము దిగి నడిచి వెళ్లినచో భీముని కొలను వచ్చును. అచ్చట పురాతనమైన శివాలయము కలదు. కైలాసద్వారము, భీముని కొలనులకు వెళ్ళవలెయునన్నచో ఉదయమునే కనీసము 4 గురు లేక 5 గురు ఒక గ్రూపుగా ఆహారము, భోజనము, మంచినీరు తీసుకొని వెళ్ళి కొంత సమయము గడిపి తిరిగి రావచ్చును. ఒంటరిగా వెళ్ళటము ప్రమాదము.

**శిఖర దర్శనము :**

శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే. అని యుగ యుగాలనుంచి భక్తావళి నమ్మకము. అనగా శ్రీశైల మల్లికార్జునస్వామి ఆలయ శిఖరాన్ని శిఖరేశ్వర స్వామి పర్వతము నుంచి దర్శించగలిగినచో పునర్జన్మ మరి లేదు అని నమ్మకము. కాని యిచ్చట గమనించ వలసిన విసయము శిఖరేశ్వరస్వామి, పర్వతము నుండి బైనార్క్యులర్స్‌తో చూచినను శ్రీ మల్లిఖార్జున స్వామివారి ఆలయ శిఖరము కన్పించదు ఎందువలననగా ఆలయమునకు నాల్గు ప్రక్కలా నున్న గోపురములు మరియు 20 అడుగులు ఎత్తువున్న ప్రాకార గోడలు అడ్డువచ్చును. కనుక స్వామివారి ఆలయ శిఖరము ఎటువంటి పరిస్థితులలోను కన్పించదు. మరియు శ్రీ మల్లిఖార్జున స్వామివారి ఆలయ ప్రాంగణము నుండి శిఖరేశ్వర స్వామి శిఖరాన్ని దర్శించాలన్నా అదీ కన్పించదు. ఈ 'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే' అన్న దానికి వేరే ఏదైన ఉద్దేశము వుండి వుండ వచ్చును.

మనము తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామి దర్శనానంతరము స్వామివారి ఆలయ ప్రదక్షిణముగా వచ్చునపుడు ఆలయ శిఖరము మీదనున్న శ్రీ వేంకటేశ్వర స్వామి బంగారు ప్రతిమను తప్పక దర్శనము చేసికొందుము. ఆ విధముగా తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామిని శిఖర దర్శనము చేసికొని పరిక్రమము పూర్తి అయినదని నమ్ముదుము.

ఆ విధముగానే శ్రీశ్రీశ్రీ మల్లిఖార్జున స్వామి దర్శనము అనంతరము స్వామివారి ఆలయ శిఖరము మీదనున్న ఆరు త్రిషూలములను దర్శించివలసియున్నది. స్వామివారి ఆలయముపైన ఒకటి, నాలుగు ప్రక్కల గాలుగు, మరియు కొంచెము క్రిందుగా ఒకటి

మొత్తము ఆరు త్రిషూలములను ఒకేసారిగా దర్శనము చేసికొనవలయును. ఈ ఆరు త్రిషూలములు ఉమామహేశ్వరుల ఆలయము ప్రక్కగా శివాజీ గోపురమునకు వెళ్లుమార్గములో మెట్లపైనుండి మాత్రమే కన్పించును. మరి ఎక్కడనుండి ఈ ఆరు ఒక్కసారిగా కన్పించవు. 5 లేక నాలుగు కన్పించునుగాని ఆరు మాత్రము అచ్చటనుండి కన్పించును. శ్రీ మల్లిఖార్జునస్వామిని శ్రీ భ్రమరాంబా మాతను స్మరణము చేసికొనుచు ఆరు త్రిషూలములను దర్శించుటయే శిఖర దర్శనము అని రచయిత నమ్మకము. ఈ విషయములో ఎవరి నమ్మకము వారిది.

శ్రీ శిఖరేశ్వరస్వామి ఆలయములో ఘనము చేయుచున్న మరియొక తప్పిదము ఏమనగా శ్రీ శిఖరేశ్వరస్వామిని దర్శనము చేసికొనుట. ఎందువలన అనగా స్వామివారిని సేవించిన భక్తులే స్వామివారి ఆలయ శిఖరముపై తమ తమ పాదములతో అపవిత్రము చేయుచున్నారు. కావలెనన్న స్వామి వారి ఆలయముపైకి ఎక్కకుండ సగముమెట్లు మాత్రము ఎక్కి శ్రీశైలము దర్శించిన స్వామివారి ఆలయముపై పాదములు మోపే అవుసరము వుండదు కనుక ఏ దోషము వుండదు. ఇది నిశ్చయముగా రచయిత అభిప్రాయము.

ఇంకనూ ఈ క్షేత్రములో దర్శించ వలసిన ప్రదేశములు చాలావున్నవి. వాటిని గూర్చి విపులముగా వ్రాయవలయునన్న స్థలాభావము. అందువలన వాటి పేర్లను మాత్రమే ఉదహరించుచున్నాను.

(1) సిద్ధి రామప్ప కొలను. (2) మల్లమ్మ కన్నీరు (3) అలంకార ఈశ్వరుడు (4) పాతాళ గంగ (5) శ్రీశైలం డామ్ (6) శివాజీ స్ఫూర్తి (7) సప్త మాతృకలు (మనోహర గుండమునకు పైన మంటపము మీద వున్నవి) (8) శమీ వృక్షము (9) కళ్యాణ మంటపము (10) ఆలయ ప్రాకారము మీదనున్న శిల్ప సంపద. యింకను అనేకములైన ప్రదేశములున్నవి. వాటి వివరములు కావలెనన్న శ్రీశైల స్థలపురాణములో లభించును.

## స్థల పురాణము :

శిలాదుడు అను మహర్షి శ్రీ శివ భక్తుడు. చాలా కాలము సంతానమును కొరకు శ్రీశివదేవుని గూర్చి తపస్సుచేసెను. ఆయన తపమునకు మెచ్చి శివదేవుడు దర్శనము యిచ్చి యిద్దరు కుమారులను అనుగ్రహించెను. వారే పర్వతుడు, నందికేశుడు. వీరు తండ్రి కంటే గొప్ప

శివభక్తులై స్వామిని గూర్చి తపస్సు చేయగా స్వామివారు ప్రత్యక్షమై వరమును కోరుకొమ్మనెను. నందికేశుడు తనను స్వామివారి వాహనముగా అనుగ్రహించమని వేడుకొనెను. పర్వతుడు స్వామివారిని ఎల్లప్పుడు తనమీద నిలువమని కోరుకొనెను. వారిద్దరి కోర్కెలను స్వామివారు మన్నించెను. అప్పటినుండి నందికేశుడు స్వామివారి వాహనము అగు నందీశ్వరునిగా ఎల్లప్పుడు స్వామివారి సన్నిధిలో నుండసాగెను. పర్వతుని కోర్కెప్రకారము స్వామివారు మల్లికార్జున లింగరూపమున పర్వతునిపై స్వయం భూజ్యోతిర్లింగముగా వెలసి ఆయన కోర్కెను తీర్చెను. శ్రీ స్వామి వారు వెలసినప్పటి నుండి ఆ పర్వతమునకు శ్రీ పర్వతము అని పేరువచ్చెను.

భక్తులు ఒక వేళ అన్నిటిని దర్శించ లేకపోయిన కనీసము ఈ దిగువ ఉదహరించినవవి దర్శించి పరిక్రమము పూర్తి చేయుట మంచిది.

1) శ్రీ మల్లికార్జున, భ్రమరాంబాదేవేరులు.
2) బయట వీరభద్రుడు (క్షేత్రపాలకుడు)
3) అంకాళమ్మ తల్లి (గ్రామదేవత)
4) సాక్షి గణపతి
5) ఫాలధార - పంచధార
6) హాటకేశ్వరము
7) శిఖర దర్శనము
8) పాతాళగంగ

ఈ ప్రధమ క్షేత్రదర్శనము నుండి రెండవ క్షేత్రమునకు బయలుదేర వలెయును.

# రామేశ్వర జ్యోతిర్లింగము

శ్రీశైలము నుండి రామేశ్వరమునకు వెళ్లవలెనన్న మంచి రోడ్డున వెళ్లుట మంచిది. మరియు దగ్గరమార్గము కూడ చూచుకోవలయును. కారుమీద ప్రయాణము కనుక శ్రీశైలము నుండి (1)దోర్నాలకు రావలయును. అచ్చట నుండి (2) మార్కాపురము (3) పొదిలి మీదుగా (4) ఒంగోలు రావలెయును. అచ్చటి వరకు రోడ్డు ఒక మాదిరిగా నుండును. ఒంగోలు నుండి నేషనల్ హైవే (5) మద్రాసు వరకు. మద్రాసునుండి (6)

తిరుచునాపల్లి (**TRICHY**) వరకు నేషషనల్ హైవే. మార్గమధ్యములో విల్లుపురం పెరంబలూరు (ఇది **NH** 45) మాఈదనున్నవి. వీటి మీదుగా తిరుచ్చి జేరిన తరువాత స్టేట్ హైవే పుదుక్కోటై - తిరుమయం - కరైకుడి - రామనాధ పురంకు చేరవలయును. రామనాధపురం నుండి రామేశ్వరము జేరవచ్చును. మార్గమధ్యములో అనుమానము వచ్చిన ఏ పెట్రోల్ పంపులో అడిగిన వారు చెప్పెదరు లేదా ఏ పోలీసు ఆఫీసరును అడిగినను అతను కూడ మార్గము చెప్పును.

(**.N.B. Car**). మీద కాకుండా రైలులో ప్రయాణము చేయవలెనన్న శ్రీశైలము నుండి బస్సులో ఒంగోలు వరకు వెళ్లి అచ్చటనుండి ట్రైనులో మద్రాసు చేరవలెయును. మద్రాసు సెంట్రల్ స్లేషన్ నుండి ఎగ్మోర్ రైల్వేస్టేషన్‌కు వెళ్లి రామేశ్వర మునకు ట్రైనులో వెళ్లవచ్చును. లేదా మద్రాసు నుండి తిరుచ్చి లేదా మధురకు బస్సులో వెళ్లి అక్కడ నుండి మరియొక బస్సులో రామేశ్వరము వెళ్లవచ్చును. ఒకవేళ మద్రాసునుండి రామేశ్వరమునకు డైరెక్టు బస్సు వున్నదో అన్న విషయము కనుక్కొని వుంటే డైరెక్టు బస్సులో రామేశ్వరముకు వెళ్లవచ్చును.

15 లేదా 20 సంవత్సరము క్రితము వరకు రామేశ్వరము వెళ్లవలెనన్న మండపమో అను వూరివరకు కారు లేదా బస్సులో వెళ్లి అచ్చటినుండి సముద్రము మీద రోడ్డు బ్రిడ్జి



శ్రీ రామనాథ స్వామి

కట్టినారు. కనుక మనము కారు మీదగాని బస్సు మీద గాని సరాసరి రామేశ్వరము జేరవచ్చును.

రామేశ్వరము బంగాళాఖాతములో నున్న చిన్న ద్వీపము. చాలా మనోహరముగా నుండును. చుట్టూ సముద్రము మధ్యలో ధ్వీపము. ఇచ్చట దొరకని వస్తువులేదు. చాలా హోటల్స్ వున్నవి. తక్కువ చార్జీలతోను మరియు ఎక్కువ వసతులతో ఖరీదైన హోటల్స్ కూడా వున్నవి. ఇవిగాక చాలా ధర్మ సత్రములు వున్నవి. కాని వారు చార్జీవసూలు చేయుదురు. ఉండుటకు సౌకర్యముచాలా కలదు. భోజనవసతి బాగా వున్నది.

రామనాధస్వామి ఆలయము యొక్క గాలి గోపురము దక్షిణ భారతదేశములో ఏ ఆలయ గోపురానికి తీసిపోదు. స్వామివారి లింగేశ్వరుడు అమ్మవారి పేరు పర్వతవర్ధని. స్వామివారిని తాకుటకు వీలులేదు. దూరము నుండి దర్శనము చేసికోవలెయును. స్థలపురాణము, శ్రీరామచంద్రుడు రావణ బ్రహ్మను సంహరించిన అనంతరము బ్రహ్మహత్యా దోషనివారణార్ధము రామేశ్వరములో శ్రీ శివదేవుని లింగ ప్రతిష్టకు నిర్ణయించినారు. అందుకుగాను ఆంజనేయ స్వామివారు హిమాలయములోని కైలాస పర్వతము దగ్గర నుండి శ్రీ శివలింగమును తెచ్చుటకు వెళ్లెను. కాన్ని లింగ ప్రతిష్ఠకు ముహూర్త సమయమైనందున సీతమ్మ తల్లి సైకత (యిసుక) లింగమును తయారు చేసినది. శ్రీరామచంద్రుడు ఆ లింగమును ప్రాణప్రతిష్ఠాను పూర్వకముగా ప్రతిష్ఠించిరి. ఈ ప్రతిష్ఠ జరిగిన తరువాత ఆంజనేయస్వామి కైలాస పర్వతమునుండి శివలింగమును తెచ్చిరి. ఆయనను తృప్తి పరచుటకుగాను శ్రీరామచంద్రుడు ఆ లింగమును కూడ ప్రతిష్ఠించిరి. శ్రీరాములవారు ప్రతిష్ఠించిన లింగమును శ్రీరామలింగేశ్వరుడనియు, ఆంజనేయస్వామి తెచ్చిన లింగమును కాశీవిశ్వేర లింగము అని పూజలు పొందుచున్నవి.

శ్రీరామలింగేశ్వరస్వామి (జ్యోతిర్లింగ) ప్రాదుర్భవమునకు వేరొక ఇతిహాసము చెప్పెదరు. శ్రీరాముల వారు వానరసైన్యముతో యుద్ధమునకు వచ్చి శ్రీ శివదేవుని అనేక విధములుగా ప్రార్థించినంత శ్రీశివదేవుడు ఆయనకు ప్రత్యక్షమయ్యేను. రామా నీ భక్తికి మెచ్చితిని ఏమి కావలయునో కోరుకొమ్మనెను. స్వామి వారి దర్శనము శ్రీరామచంద్రునకు, లక్ష్మణునకు తదితరులకు వానర సైన్యమునకు కర్గి వారు తమ జన్మధన్యమైనదని ఆనందములో నుండిరి. అప్పుడు శ్రీరాముడు శ్రీశివదేవుని స్వామి ఈ వానరసైన్యమునకు

రాక్షసులను జయించు శక్తినిచ్చి యుద్ధములో విజయము తమకు కల్గునట్లు కోరుకొనెను. శ్రీశివదేవుడు నీ కోర్కె నెరవేరునని శ్రీరాముని దీవించెను. అపుడు శ్రీరాముడు స్వామివారిని దర్శనమిచ్చిన చోటనే ఎల్లవేళలా వుండునట్లు కోరుకొనెను. అపుడు శ్రీశివదేవుడు శ్రీరామలింగేశ్వర జ్యోతిర్లింగముగా యిచ్చోట వెలసి పూజలందు కొనుచున్నారు. ఆ విధముగా ఈ క్షేత్రము శైవులకు - వైష్ణవులకు కూడ పుణ్యక్షేత్రమైనది. రామేశ్వరక్షేత్రములో దర్శనీయ ప్రదేశములు స్వామివారి ఆలయము మూడు ప్రాకారములతో నొప్పారుచున్నది.

1) శ్రీరామనాధస్వామి జ్యోతిర్లింగము.
2) శ్రీ పర్వత వర్ధనీ మాత.
3) గంధమాధవ పర్వతము.
4) కోదండరామస్వామి ఆలయము.
5) సముద్రస్నానము.
6) ఆలయ ప్రాంగణములోని మంచి నీటిభావులలో స్నానము.

రామనాధ స్వామి ఆలయము చాలా మనోహరముగా నుండును. ఆలయ ప్రాంగణము షుమారు 4000 అడుగుల పొడవు 21 అడుగుల వెడల్పు 30 అడుగులు ఎత్తుగల్గి గాలికొరకు వెంటిలేషన్ ఏర్పాటుతో మంటపస్థంబాలు అన్నీ శిల్పాలతో పొదగబడి యున్నది. చుట్టూయిసుక తోనున్న ద్వీపము అంతటి ఏకశిలలు చాలా దూరము నుండి తేబడి చెక్కి సముద్రము మీద తీసికొని వెళ్లబడి అమర్చబడిన తీరుచూస్తే మనము సంభ్రమము ఆశ్చర్యములలో మునిగిపోతాడు. ఆలయము ద్రావిడ శిల్పరీతిలో నిర్మించబడినది. ఆలయ ప్రాంగణములో శ్రీస్వామివారి జ్యోతిర్లింగము, పర్వత వర్ధనీ మాత ఆలయము నటరాజ మందిరము, అంజనేయ స్వామి వారిచే ప్రతిష్ఠింబడిన కాశీవిశ్వేశ్వర స్వామి మందిరము సేతుమాధవ స్వామి ఆలయము తప్పక దర్శించవలెను.

ప్రతిరోజు స్వామివారిని గంగా జలముతో అభిషేకము చేయుదురు. ప్రాతఃకాలమునుండి రాత్రివరకు స్వామివారికి అమ్మవారికి వివిధ రకములైన పూజలు నిర్వర్తించుచున్నారు. తెల్లవారు జామున 4గం॥లకు స్వామివారి స్పటిక లింగ దర్శనముండును. దేవాలయ ప్రాంగణములో 22 తీర్థాలు మరియు యితర ప్రదేశములతో 21 తీర్థాలు వున్నవి. అన్నీ మంచినీటి తీర్థాలే. సముద్రము దగ్గరలోనున్నను అన్నీ మంచినీటి

తీర్థములుండుట స్వామివారి మహాత్మ్యమే. యాత్రచేయువారు ముందుగా పురోహితుని మాట్లాడుకొని రుసుము కట్టినచో వారు మనలను ఒక్కొక్క తీర్థము (నూయి) దగ్గరకు తీసికొని వెళ్లి ఆనూతిలోని నీటిని చేదతో చేది మనకు తల స్నానము చేయించెదరు. అనగా ఒక్కొక్క తీర్థము వద్ద ఒక్కొక్క చేదతో నీటినితోడి మన తలమీద పోసి మనలను స్నానము చేయించెదరు. ఈ జలము ఔషధ జలము కనుక మనశరీర రుగ్మతులు తొలగును అని నమ్మకము.

ఈ అన్ని తీర్థములలోని జలమును కలిపి ప్లాస్టిక్ సీసాలలో నింపి దేవస్థానము అమ్మకము చేయుచున్నది. ఆ జలమును తీసికొని మనము కాశీ వెళ్లినపుడు కాశీవిశ్వేరస్వామిని అభిషేకము స్వయముగా చేయవలయును. తిరిగి కాశీలోని రామేశ్వర రామలింగ స్వామికి సమర్పించిన (అభిషేకము పూజారులే చేసెదరు. అది మనము దర్శించవచ్చును) కాశీరామేశ్వర యాత్ర సంపూర్ణమగునని పెద్దలు చెప్పెదరు.

## ఆలయములోని తీర్థములు :

(1) మహాలక్ష్మి - సావిత్రి - గాయిత్రి - సరస్వతి - మాధవ - గంధ మాధవ - గవాక్ష - గవయ - నీల - శంక - శంకర - బ్రహ్మ హత్యా విమోచన - సూర్య - చంద్ర - గంగ - యమున - గయ - శివ - సత్యామృత - సర్వ తీర్థము - కోటి తీర్థము ఇవి 1-2-3 ప్రాకారుమలలోనే అమరియున్నవి. మిగిలినవి ఇతర ప్రదేశములలోనున్నవి.ఎక్కువగా యివి గంధమాధవ పర్వతమునకు వెళ్లుమార్గములోనున్నవి. దేవస్థానములో వివిధ రాజవంశీకులు సమర్పించిన విలువైన ఆభరణములు ఎన్నో వున్నవి. స్వామివారిని అమ్మవారిని అలంకరించిన దృశ్యము చాలా మనోహరముగా నుండును.

## గంధమాధవ పర్వతము :

స్వామివారి ఆలయమునకు 5 కిలోమీ దూరములోనున్నది. శ్రీ హనుమంతులవారు సీతాదేవిని వెదకుటకు సముద్రమును లంఘించుటకు ప్రవేశించెనని చెప్పెదరు. ఈ పర్వతము మీద నున్న రెండు అంతస్తుల దేవాలయము ఎక్కితే రామేశ్వర ద్వీపముచాలా వరకు కన్పించును. ఇచ్చట రాముల వారి పాదాల ముద్రల చక్రము మీద ప్రతిష్ఠించబడి భక్తులను ఆకర్షించుచున్నవి.

**ధనుష్కోటి :**

ఇది ఒక ద్వీపము. రావణాసురుని తమ్ముడైన విభీషణుడు శ్రీరాముని శరణుచొచ్చిన స్థలము. శ్రీలంకకు యిచ్చట నుండే వారధి కట్టినారని చెబుతారు. కాని వారధిని రామనాథ పురమునకు 10 కిలోమీర్ల దూరములోనున్న తిరుప్పల్లని (దర్భాశయము) వద్ద నుండి కట్టినారని కూడచెబుతారు. ఇప్పటికిని అచ్చట సముద్రము దగ్గర రాళ్ళువున్నవి అవే వారధికి వుపయోగించనవి అని చెబుతారు. ఇచ్చట శ్రీరాములు వారు పవ్వళించి వున్న విగ్రహముతో పెద్ద దేవాలయమున్నది. భారతదేశంలో శ్రీరాములు వారు పవ్వళించి వున్న విగ్రహముతోనున్న ఆలయంఇది ఒక్కటే. తిరుగు ప్రయాణములో దర్భాశయమునుకూడ దర్శించవచ్చును. ధనుష్కోటికి కారు రోడ్డు వున్న. 1964 లో వచ్చిన తుఫానుకు ఈ ద్వీపము చిన్నా భిన్నము అయినది. ఒక్క కోదండ రామస్వామి ఆలయం మాత్రము మిగలినది. ధనుష్కోటి రామేశ్వరమునకు 2 కి.లో. దూరములోనున్నది. ఇంకనూఏ కొంత రామేశ్వరాలయం - నంచి నాయకి అమ్మన్ - విల్లోరిని తీర్థము - భైరవ తీర్థము మొదలగునని చూడదగిన ప్రదేశములు.

శ్రీ రామేశ్వర క్షేత్ర శ్రీరామలింగేశ్వరస్వామి దర్శన పరిక్రమము అననంతరము మూడవ జ్యోతిర్లింగమునకు ప్రయాణము మొదలు పెట్టవచ్చును. శ్రీరామేశ్వరక్షేత్రదర్శనము రెండు దినములలో పూర్తిగావించి మూడవదినము ప్రయాణముసాగించవచ్చును.

## డాకిన్యాంభీమశంకర జ్యోతిర్లింగము

శ్రీ రామేశ్వర క్షేత్రమునుండి డాకిన్యాంభీమశంకర జ్యోతిర్లింగమునకు బయలుదేరవలెను. ఈక్రింగాపేర్కొన్న పట్టణముల గుండా కారు ప్రయాణము సాగించవలయును.

1) రామేశ్వరము
2) మధురై
3) దిండిగల్లు(ఇంతవరకు N.H.49 మీద ప్రయాణము.
4) కరూర్
5) సేలం
6) ధర్మపురి
7) క్రిష్ణగిరి
8) బేంగళూరు (N.H. 7)
9) తమ్‌కూరు (N.H.4)
10) చిత్రదుర్గ (N.H.4)
11) ధర్వాడ్ ( N.H.4)
12) బెల్గామ్ ( N.H.4)
13) కొల్హాపూర్ (N.H.4)
14) సతారా (N.H.4)
15) పూణే (N.H.4)
16) రాజ్‌గురునగర్ (N.H.50)
17) భీమాశంకర్

| | | | |
|---|---|---|---|
| 1. | రామేశ్వరము - మధురై | — | 122 K.M |
| 2. | మధురై - దిండిగలు | — | 63 K.M |
| 3. | దిండిగల్ - కరూర్ | — | 77 K.M |
| 4. | కరూర్ - సేలం | — | 87 K.M |
| 5. | సేలం - ధర్మపురి | — | 67 K.M |
| 6. | ధర్మపురి - క్రిష్ణగిరి | — | 48 K.M |
| 7. | క్రిష్ణగిరి - బెంగుళూరు | — | 90 K.M |
| 8. | బేంగళూరు - తుమ్కూరు | — | 72 K.M |
| 9. | తుమ్కూరు - చిత్రదుర్గ్ | — | 130 K.M |
| 10. | చిత్రదుర్గ్ - ధార్వాడ్ | — | 120 K.M |
| 11. | ధార్వాడ్ - బెల్గామ్ : | — | 81 K.M |
| 12. | బెల్గామ్ - కొల్హాపూర్ | — | 108 K.M |
| 13. | కొల్హాపూర్ - సతారా | — | 119 K.M |
| 14. | సతారా - పునా | — | 137 K.M |
| 15. | పునా - మంచార్ | — | 61 K.M |
| 16. | మంచార్ - భీమాశంకర్ | — | 55 K.M |
| | | షుమారు | 1537 K.M ప్రయాణము |

ఈ ప్రయాణములో దారిలో వున్న పుణ్యక్షేత్రములు దర్శించుకొనవలెనన్న దర్శనముచేసికొనవచ్చును.

1) రామనాథపురము దగ్గరలోనున్న దర్భాశయనం.

2) మధురమీనాక్షి అమ్మవారు సుందరేశన్ స్వామి వారి దర్శనము.

3) బేంగుళూరు నగరము

4) కొల్హాపూర్ మహాలక్ష్మి అమ్మవారు. అష్టాదశపీఠములలో ఒకటి.

5) పూనా నగరము.

మనము రైలు మీద ప్రయాణము చేయవలెనన్న బెంగుళూరునుండి పునా నగరమునకు మద్రాసునుండి పునానగరమునకు - విజయవాడ లేదా హైదరాబాద్ నుండి పూనా నగరము చేరినఅచ్చటనుండి బస్సుమీద భీమాశంకర్ జేరవచ్చును.



భీమాశంకర్

పునా నగరమునుండి నాసిక్ వెళ్ళు Highway 50 మీద ప్రయాణము చేయవలయును. పునానుండి షుమారు 74 కి.మీ దూరములో మంచార్ అను టౌన్ (పెద్ద గ్రామము) వచ్చును. అచ్చటనుండి Highwayకు ఎడమప్రక్కగాప్రయాణించవలయును. షుమారు 55 కి.మీ ప్రయాణము రోడ్డు ఒక మోస్తరుగా నుండును. (పునా నుంచి మరియు నాసిక్ నుంచి భీమాశంకర్‌కు బస్సులు నడుచుచుండును.) అపుడు భీమాశంకర్ గ్రామమునకు. జేరుదుము భీమాశంకర్ చిన్న కుగ్రామము. ఇప్పుడు కొన్ని సత్రములు కట్టినారు. పర్వదినములలో వసతి దొరుకుట కష్టము. చిన్న భోజనహోటల్ మరియు కాఫీ హోటళ్లు వున్నవి. అన్ని వస్తువులు దొరకుట కష్టము. 15 సంవత్సరములు క్రితము వరకు పూజార్లు భోజనము ఏర్పాటు చేసెడివారు. కాని యిప్పుడు Hotels లో భోజనము దొరకును. లేదా మనము వండుకొనవచ్చును. ఈ ప్రయాణములో కొంత ఘాట్‌రోడ్ వుండును. కాని చాలా చిన్న ఘాట్. స్వామి వారి ఆలయం చిన్న గట్టుమీద వున్నది. అక్కడికి వెళ్లుటకు మెట్లువున్నవి. దారిలో ఇరువైపుల చిన్న హోటళ్ళు వున్నవి. ఏమైనా వసతులు ఫరవాలేదనే అని చెప్పవచ్చును.

**స్థలపురాణము :** పూర్వము కర్కటి అను రాక్షసికి కుంభకర్ణునికి పుట్టినవాడే భీమాసురుడు. ఇతడు తన తల్లిని తన తండ్రిని గూర్చి అడుగుగా ఆమె కుమారునితో తన మొదటి భర్త అయిన విరాధుని భీమాసురుని తండ్రి అయిన కుంభకర్ణుని కూడ శ్రీ నారాయణుని అంశ అయిన శ్రీరాముడు సంహరించెనని చెప్పెను. అందుకు భీమాసురుడు నారాయణుని

మీద పగ సాధించవలెనని నిశ్చయించెను. భీమాసురుడు బ్రహ్మదేవుని గూర్చి వేయి సంవత్సరములు ఘోరమైన తపస్సుచేసి బ్రహ్మదేవుని ప్రసన్నునిగాచేసి కొనెను. బ్రహ్మదేవుడు భీమాసురుని వరము కొరుకొమ్మనెను. ఆ రాక్షసుడు ఈ బ్రహ్మాండములో తనతో సమానమైన బలవంతుడు వుండరాదని కోరుకొనెను. బ్రహ్మదేవుడు అటులనే అని వరమునిచ్చెను.

తదుపరి ఇంద్రుడు మొదలగు దేవతలను జయించి నారాయణుని కూడ జయించెను. తరువాత పాతాళమునకు వెళ్లి అచ్చటి చక్రవర్తి శ్రీ శివ భక్తుడైన కామారూపేశ్వని దర్మపత్నీ సమేతముగా చెరసాలలో బంధించెను. తనను తప్ప ఏ యితర దేవుళ్లను పూజ చేయకూడదని శాశించెను. కాని కామరూపేశ్వరుడు అతని భార్య అయిన సుదక్షిణా దేవి మానస పూజావిధానమున శ్రీ శివదేవుని ప్రణవ సహితశివపంచాక్షరీతో పూజించుచుండిరి. భీమాసురుడు మూడు లోకములలోను ఎచ్చటా యజ్ఞయాగాదులు జరుగకుండా చేయుచు తననే పూజించవలెనని అందరిని బాధించుచుండెను.

బ్రహ్మ, విష్ణువు వెంటరాగా దేవతలు మహా కోశీనదీ తీరమున పార్థివలింగము చేసి శ్రీ శివదేవుని ప్రార్ధనలు చేయగా శ్రీ శివదేవుడు ప్రత్యక్షమయ్యెను. వీరందరు ఆ దేవదేవుని అనేక విధముల ప్రార్థించగా పరమేశ్వరుడు వారిని ఏమి కావలయునో కోరుకొమ్మనెను. అపుడు వారు భీమాసురుని దురాగతములను విన్నవించి వానిని సంహరించమని వేడుకొనిరి. శ్రీ శివదేవుడు వారి కోర్కెను మన్నించెదనని చెప్పి అంతర్ధానము అయ్యెను.

పాతాళములో కామరూపేశ్వరదంపతులు శ్రీ శివదేవుని అఖండముగా ప్రార్థించుచుండిరి. శ్రీశివదేవుడు కామరూపేశ్వరదంపతుల వద్దనే పార్థివలింగరూపమున వుండి వారి సేవలను స్వీకరించ మొదలిడెను. రోజు రోజుకు ఆ పాతాళ రాజు యొక్క పూజలు ఎక్కువ కాజొచ్చెను. అదిచూచి ఆ రాక్షసుడైన భీమాసురుడు పాతాళరాజును అధికముగా వేదించమొదలిడి నీవుచేయు పూజ ఆపుమనెను. లేదా ఆ లింగమును భిన్నమొనర్చదననెను. అంతట మహారాజు భయపడక శ్రీ శివదేవుని మీద నమ్మకముతో నీచేతనైనది చేసి కొమ్మని పూజలు కొనసాగించుచుండెను. అదిచూచి భీమాసురుడు తనచేతిలోని కత్తితో శ్రీ శివలింగమును త్రాకెను. రాక్షసుని కత్తితగిలిన వెంటనే శ్రీ శివదేవుడు ప్రత్యక్షమై ఓరీ అసురా నా భక్తులను రక్షించుటే నాకర్తవ్యమని ఆ రాక్షసుని సంహరించెను. అప్పుడు శ్రీ శివదేవుని కోప జ్వాలలు అచ్చటి వనములను దహించ మొదలుపెట్టి

రాక్షసగుణములను సజీవదహనము చేసెను. ఆ భస్మముల కాలము గడచిన కొలది ఔషధముల మొక్కలుగా జన్మించి మానవాళికి ఉపయోగపడజొచ్చెను. ఆ ఔషధ మొక్కలు భూతప్రేత పిశాచాదులను పారద్రోలు మూలికలు ఉపయోగపడజొచ్చెను. భీమాసురుని తల్లి కర్కటి కుమారుని శరీరమును పాతాళము నుండి భూమి మీదకు తెచ్చి శ్రీశివదేవుని దీనాతీ దీనముగా పార్థించగా స్వామి దర్శనమిచ్చి వరము కొరుకొమ్మనెను. అపుడు ఆమె తన తనయుని పేరు చిరస్థాయిగా నుండునట్లు స్వామి వారిని జ్యోతిర్లింగముగా వెలయుమని ప్రార్థించెను. ఆయన దర్శనార్థము వచ్చిన సర్వదేవతలు కూడ అదే కోరుకొనెను. అప్పుడు శ్రీ శివదేవుడు భీమాశకంకర జ్యోతిర్లింగముగా ఆ సహ్యాద్రి పర్వతములలో వెలసెను. కృష్ణానదికి ఉపనది అయిన భీమానది అచ్చటనే పుట్టి స్వామి వారిసేవకు ఉపయోగపడుచు పోను పోను పెద్దనదిగా మారి కృష్ణానదికి ఉపనది అయినది. శాకినీ, ఢాకిన పిశాచగణములు ఎక్కువగాయిచ్చోట స్వామి వారిని సేవించుచుండును. అచటకు వచ్చిన భక్తులకు ఉపకారము చేయును గాని అపకారము చేయకుండెను. అందుకుగాను ఆక్షేత్రమును ఢాకీ న్యాంభీమాశంకరము అని నామధేయముతో ఒప్పారుచున్నది. ఇచ్చటనుండి పాతాళలోకమునకు మార్గమున్నదని చెప్పెదరు.

ఈ క్షేత్రము సహ్యాద్రి పర్వతముల మధ్యలోనుండి ప్రకృతిరమణీయత అంటే ఇట్లా వుండునా అనిపించును. ఈ జ్యోతిర్లింగమును మనము చేతితో తాకవచ్చును. స్వయముగా అభిషేకము చేసికొనవచ్చును. అచటి పూజారులు పూజాకార్యక్రమములు నిర్వర్తించుచు మనకు కావసిన పూజలు చేసెదరు. పర్వదినములలో తప్ప మిగతా దినములలో భక్తులు సందోహము చాలా తక్కువగా వుండును.

ఇదియే డాకిన్యాంభీమాశంకరజ్యోతిర్లింగము యొక్క ప్రాశస్థత.

# త్రయంబకేశ్వర జ్యోతిర్లింగము

సహ్యాద్రపర్వత పంక్తులలో వేంచేసియున్న మరియొక జ్యోతిర్లింగము త్రయంబకేశ్వర జ్యోతిర్లింగము.

## మార్గము

| | | |
|---|---|---|
| 1) | భీమాశంకర్ - మంచార్ — | షుమారు 55 కి.మీ |
| 2) | మంచార్ - సంగమన్నార్ — | 77 కి.మీ |
| 3) | సంగమన్నార్ - నాసిక్ — | 71 కి.మీ |
| | | 203 కి.మీ |

**Note :** భీమాశంకర్ నుండి బస్సుమీదో నాసిక్ జేరవలెను. రైలు రూటు లేదు.

మంచార్ నుండి N.H 50 మీద సంగమన్నార్ మీదుగా నాసిక్ పట్టణము చేరవలయును. నాసిక్ నుండి 32 K.M త్రయంబకేశ్వర్ క్షేత్రం వేంచేసియున్నది. మంచి రోడ్డు. అచ్చట మంచి భోజన హోటళ్లు సత్రములు - Guest House – Tourist Home మరియు మంచి Lodges వున్నది. పావనగోదావరినది ఈ సహ్యాద్రి పర్వతములలో బ్రహ్మగిరిలో చిన్న ధారగా ప్రవహించుట మొదలిడి మహారాష్ట్ర - కర్ణాటక - ఆంధ్రదేశము రాష్ట్రముల ధాతారా ప్రవహించి తూర్పుగోదావరి జిల్లాలో సాగర సంగము చెందుచున్నది.

గోదావరి నది మొదలైన స్థలము బ్రహ్మగిరిలో నున్నది. అక్కడకు మనము వెళ్లి పూజలు చేసికొనవచ్చును. షుమారు 500 మొట్లు ఎక్కిని బ్రహ్మగిరిలో గోదావరినది పుట్టిన స్థానమువచ్చును. దానినే గంగాధ్వార్ అంటారు. గోదావరి అమ్మవారికి ఆలయం గలదు. దగ్గరలో చూడదగిన ప్రదేశములు 1) గురుఘోరక్‌నాధునిగుహ - 2) మచ్చీంద్ర నాదునిపాదుకలు 3) 108 మహాదేవుని లింగముల స్థానము.

శ్రీ త్రయంబకేశ్వర జ్యోతిర్లింగము ఈ పుణ్యక్షేత్రములో వేంచేసియున్నది. ఆలయము చాలా పెద్దది. గోపురము చాలా ఎత్తైనది. అంతరాలయము కూడా చాలా పెద్దది. ఒకేసారి రెండువందల మంది భక్తులు భగవద్దర్శనము చేసికొనవచ్చును. గర్భాలయము అంతరాలయమునకు ఐదు ఆరు అడుగులలోతులోనున్నది. దిగుటకు మొట్లున్నవి. జ్యోతిర్లింగము కూడ చిన్న గోతిలో నుండును. ఆ గోతిలో మూడు



త్రయంబకేశ్వర్

లింగములుండును. అవే మహేశ్వర విష్ణు - బ్రహ్మ లింగాలందురు. ఆ మూడిటిని కలిపియే త్రయంబకేశ్వర జ్యోతిర్లింగముగా పరిగణింపబడుచున్నది. స్త్రీలను గర్భాలయములోనికి ప్రవేశించనీయరు. మామూలుగా అందరిని కూడ గర్భాలయములోనికి పోనీయకుండా ఏదో ఒక సాకు చూపెదరు. అచటి పండాలకు డబ్బులు యిస్తే, లోనికి పోయి దగ్గరనుండి స్వామివారిని తాకి దర్శనము చేసికొను అవకాశము కల్గించెదరు. ఆలయ ప్రహరీకి ఆలాయానికి మధ్యన చాలా ఖాళీ స్థలముండి ప్రదక్షిణలు చేయుటకు వీలుగా నున్నది. స్వామి అమ్మవారి నామధేయము అంబికామాత.

బ్రహ్మగిరినుండి చిన్నగా ప్రవహించుచువచ్చి ఆలయము వద్దనున్న చిన్ననలుపలకలగానున్న గుండములోనికి గోదావరి నది వచ్చును. అచ్చటనుండి నెమ్మదినెమ్మదిగా ప్రవహించును నాసిక్ వద్ద కొంచెము పెద్దదిగా అగును. అచ్చటి నుండి ప్రవహించుచు అనేకపు నదులను కలుపుకొనికర్ణాటక ఆంధ్రదేశములగుండా ప్రవహించుచు బంగాళా ఖాతములో కలియుచున్నది.

మహారాష్ట్ర రాజు అయిన బాలాజీ బాజీరావు అనే ఆయన స్వామి వారికి ప్రస్తుతమున్న ఆలయమును నిర్మించెను.

## స్థలపురాణము :

బ్రహ్మగిరిపై గౌతమమహర్షి అహల్యాదేవితో తపము చేయుచుండిరి. అట్టి సమయులో ఆ చుట్టుప్రక్కల భయంకరమైన కరువు ఏర్పడినది. తపజపములకు నీరులేకుండెను. అపుడు గౌతమమహర్షి వరుణ దేవుని ప్రార్థించి ప్రసన్నునిగా చేసికొనెను. కాని వరుణుడు శివదేవుని ఆనతికి వ్యతిరిక్తముగా వర్షమును కురిపించలేనని తన నిస్సహాయతను ప్రకటించెను. అట్టితరి గౌతమిమహర్షి మూరెడు లోతు గుంటను త్రవ్వి దానిలోనికి తరుగులేనటువంటి దివ్య జలము నిమ్మని ప్రార్థించెను. వరుణుడు అట్లేనని నిత్యము ఆ గుంటలోని నీరు బయటకు ప్రవహించునట్లు వరము నిచ్చి ఆ అక్షయమగు నీటినీ గౌతముని పేరు మీద ప్రఖ్యాతి చెందునని వరముయిచ్చి అంతర్ధానము అయ్యెను.

అట్టి నీటితో నిత్యనైమిత్తిక కర్మలు చేయుచు ధాన్యములను ఫలము పుష్ప వృక్షములను పెంపొందించుచుండెను. అది చూచి మిగిలిన ఋషులు వారివారి సంసారములతో వచ్చి అచ్చట స్థిర నివాసమేర్పాటు చేసికొని వారి వారి నిత్యనైమిత్తి కర్మలు పుణ్య కార్యములు చేయుచుండిరి. ఒకనాడు ఋషిపత్నులకు గౌతముని భార్య అహల్యాదేవి

ఋషిపత్నులను వారించి గౌతమశిష్యులకు ప్రథమములో జలముయిప్పించెను. అది ఋషిపత్నుల అహము దెబ్బతీసినది. వారు తమ తమ భర్తలతో గౌతమ అహల్యలకు ఏదో ఒక విధముగా అపకారము చేయవలసినదిగా వత్తిడి తెచ్చిరి. చేసిన మేలును మరచిన ఋషుల అపకారమును తలపెట్టుటకే నిర్ణయించిరి.

ఒకనాడు గౌతముడు తన పొలమునందుపంటను పరీక్షించుచుండగా మునులచే పంపబడిన ఒక మాయా గోవు అచటకు వచ్చెను. అపుడు గౌతముడు ఆ గోవుతినుటకుగాను గడ్డిపరకలు విసరెను. ఆ గడ్డిపరకలు ఆ మాయా గొవుకు తగిలి అది క్రిందబడి మరణించెను. ఇది అంతయు మునులకల్పనయే. గౌతమమహర్షి గోహత్యాదోషముతో (నిజముగా గోహత్యాదోషముకల్గినది అని నమ్మి) ఆ ఋషులనేగోహత్యా దోష నివారణమును అడిగెను. అందుకు వారు గౌతమును అనుష్ఠానమును భంగము చేయుటకుగా కఠినమైన నిబంధనములను విధించిరి. 1. భూమిని మూడుసార్లు ప్రదక్షిణచేయుట 2. బ్రహ్మగిరికి 101 సార్లు ప్రదక్షిణలు చేయుట 3) గంగానదిని బ్రహ్మగిరికి తెచ్చి అందులో స్నానము చేసి కోటిలింగాలకు ఒక్కొక్కదానికి 1008 సార్లు అభిషేకము చేయుట మొదలగు ప్రక్రీయలలో ఆ దోషము పోవునని చెప్పిరి. ఆ మునులు, నుడిలినటులే గౌతమ మహర్షి చేసెను. కోటి లింగములకు భార్యా సమేతముగా ఎపుడైతే గౌతముడు అభిషేకము చేసినో శ్రీ శివదేవుడు ప్రత్యక్షమయ్యెను. శ్రీ స్వామి గౌతముని ఏమి వరము కావలెనో కోరుకొమ్మనెను. అంతగౌతముడు తన గోహత్యదోషమును తొలగించుమని కోరుకొనెను. అపుడు శ్రీ శివదేవుడు ఋషులు ఒనర్చిన అపకారము మాయాగోవుయొక్క ఉదంతము అంతయు చెప్పినీకు గోహత్యాదోషము లేదనెను. గౌతముడు సంతోషముతో ఋషులు తనకు మేలేచేసెననెను. లేకపోయినచె శ్రీశివదేవుని దర్శనభాగ్యము కలుగుకుండెడిదనెను. శ్రీ శివదేవుడు గౌతుమునితో ఏదైనా వరము కోరుకొమ్మనగా ఆయన గంగామాతను బ్రహ్మగిరిలోనుండి భక్తుల అభీష్టములునేరవేర్చునటులను స్వామి వారిని అక్షేత్రములో త్రయంబకేశ్వరునిగా నెలకొనునట్లు వరము కోరుకొనెను.

శ్రీశివదేవుడు అటులనే అని వరము యిచ్చెను. అప్పటినుండి బృహస్పతి (గురుడు) శింహరాశి యందు ప్రవేశించునపుడు దేవతలందరు అగంగానదిచెంతవుండునట్లును, గంగకు గౌతమి అను పేరుతోను శ్రీశివదేవునికి త్రయంబకేశ్వరుడు అని ప్రసిద్ధి పొందెను.

బృహస్పతి శింహరాశి సమావేశములో అన్ని పుణ్యనదులు క్షేత్ర దేవతలు అందరు ఈ గౌతమీ తీరమున నివశించెదరు. గౌతముడు ప్రార్ధించినంతనే గంగానది బ్రహ్మగిరిపై నుండు మేడిచెట్టు కొమ్మ క్రిందనుండి జలరూపముగా బయలువెడలినది. అందు గౌతముడు ప్రథమముగా స్నానము చేసెను. తరువాత బ్రహ్మగిరికి దిగువన ఒక్కచోట ధర్బకొన త్రప్పగా అది కుశావర్తమను కుండముగా పరిణమించినది. ఆ కుండమునందు గౌతముడు ప్రథమమున స్నానము చేసెను, తదుపరి ఋషులందరూ స్నానము చేసి పునీతులైరి.

కుశావర్త కుండమున భక్తీతో మునిగి స్నానాంతరము శ్రీత్రయంబకేశ్వరస్వామిని సేవించిన జన్మ రాహిత్యము కలుగునని చెప్పెదరు.

తదుపరి త్రయంబకేశ్వరక్షేత్రమునుండి తిరిగి నాసిక్ పట్టణమున కురావలమును ఇది చాలాపురాతనమైన పట్టణము. రామాయణకాలములో శ్రీరామచంద్రుడు లక్ష్మణుడ, సీతాదేవి అరణ్య వాససమయములో ఇచట కొంతకాలముండిరి. ఆ సమయములో రావణబ్రహ్మ సహోదరి శూర్పణఖ ఇచ్చటరాములవారి సహచర్యము కోరివేధించినది అప్పుడు లక్ష్మణుడు ఆమె ముక్కుచేవులు ఖండించెను. అందువల్ల ఈ ప్రదేశమును నాసిక్ (నాసిక్ = ముక్కు) అని పేరువచ్చినది.

ఇచ్చట గోదావరినది పెద్ద కాలువగా ప్రవహించుచుండును. 12 సంవత్సరములకు ఒకసారి వచ్చు పుష్కరసమయలులో లక్షలాదిమంది యత్రార్థమువచ్చెదరు. యుగాలకు పూర్వము సముద్ర మథనము తరువాత వచ్చిన అమృతఖాండమును గురుత్మంతుడు మోసికొని వచ్చు సమయమున నాలుగుచుక్కలు ఒలకినవి అని అవి నాసిక్, హరద్వార్, ఉజ్జయిని, అలహాబాద్ (త్రివేణిసంగమము) ల వద్ద పడినవి అని అందుకనే అవి మహాక్షేత్రములు అయినవని చెప్పెదరు.

**ముఖ్యముగా చూడవలసిన ప్రదేశాలు.**

1. పుష్కరక్షేత్ర ఘాట్ (ఇచ్చట శ్రాద్ధవిధులు నిర్వర్తించెదరు)
2. గోదావరినది అవతల ఒడ్డున పంచవటి. ఇచ్చట అయిదు మఱ్ఱిచెట్లు వుండు ప్రదేశము అచ్చటికి కొంచెము దూరములో పర్ణశాల ప్రదేశము. శ్రీరామచంద్రుని ఆలయము - శ్రీ కపాలేశ్వరస్వామి ఆలయము (చాలా పురాతన ఆలయము)
3. రామకుండము ఇందులో యాత్రికులు పవిత్ర స్నానాలు చేసెదరు.

4. సీతాదేవి గుహ

5. జటాయువు మోక్షప్రదేశము. ఇది షుమారు 13 లేదా 14 కిలో.మీటర్ల దూరములో నుండును. ఇచ్చటనే జఠాయువుకు శ్రీరామచంద్రుడు మోక్షమును ప్రసాదించెనని చెప్పెదరు. భద్రాచలము వద్ద కూడ పర్ణశాల - శూర్పణఖ నాసిక ఖండించిన స్థలము. శ్రీరావణాసురుడు సీతమ్మవారిని అపహరించిన స్థలము జఠాయువుకు మోక్షమిచ్చిన స్థలమున్నదని చెప్పెదరు) ఇది అంతయుగోదావరి ఒడ్డునే జరిగినట్లు చెప్పబడినది. రెండును నా అభిప్రాయములో సమ్మతమే ఎందువలన అనగా ఒక మన్వంతరములో ఈ కథాకాలము నాసిక్ జరిగినది. వేరొక మన్వంతరములో భద్రాచలము వద్ద జరిగినది. ఒక మన్వంతరములో జరిగినవి తిరిగి వేరొక మన్వంతరములో జరుగునని నమ్మకము. ఈ మన్వంతరములో కలియుగములో నున్న మనము పూర్వ మన్వంతరములలో ఇదే మనో -వాక్ - కాయ - కర్మమముల తోనున్నాను. రాబోయే మన్వంతరములోనుంటాము. రామాయణము కూడా జరుగుతుంది. ఇది రచయిత నమ్మకము.

# ఘృష్ణేశ్వర్ జ్యోతిర్లింగ దర్శనము

నాసిక్ క్షేత్ర దర్శనాంతరము (Car మీద) తిరిగి సంగ్‌మన్నార్ N.H (50) మీద రావలయును. అచ్చటనుండి 'లోని' అను బస్తీమీదుగా 'శ్రీరామ్‌పూర్' తదుపరి 'నివాస' జేరవలయును. నివాసనుండి ఔరంగాబాద్‌కు జేరవలయును. (ఇది State High way)

**Note :** (నాసిక్ నుండి ఔరంగాబాద్‌కు బస్సులుకలవు)

| | | | | |
|---|---|---|---|---|
| నాసిక్ | — | సంగమన్నార్ (సంగమ్‌నీర్) | — | 71 K.M |
| సంగమ్‌నీర్ | — | నివాస | — | 90 K.M |
| నివాస | — | ఔరంగాబాద్ | — | 55 K.M |
| | | | షూమారు | 216 K.M |
| ఔరంగాబాద్ | — | ఎల్లోరా | — | 26 K.M షూమారు |
| ఎల్లోరా | — | ఘృష్ణేశర్ | — | $1\frac{1}{2}$ K.M(వెరుల్ గ్రామము) |

ప్రయాణముతో బడలిక వున్నచో ఔరంగాబాద్‌లో బసచేసి (రూముతీసికొని) ఘృష్ణేశ్వర్ వెళ్ళి దర్శనము చేసికొని తిరగి ఔరంగాబాద్ రావచ్చును. లేదా ఘృష్ణేశ్వర్‌లో



ఘృష్ణేశ్వర్ జ్యోతిర్లింగము

బసచేయవచ్చును. ఇంచుమించు ఎల్లోరా, ఘృష్ణేశ్వర్ ఒకటిగానే భావించవచ్చును. ఘృష్ణేశ్వర్ జ్యోతిర్లింగము వేంచేసియున్న గ్రామము పేరు 'వెరుల్'. ఎల్లోరాలో హోటల్ కైలాష్ అను పెద్ద హోటల్ వున్నది. రూము ఛార్జీలు ఎక్కువే. కాని యాత్రికుల రద్దీలేనపుడు మనము బేరము ఆడి రేటు తగ్గించుమనిన తగ్గించెదరు. సామాన్యముగా శుక్ర, శని, ఆది, సోమవారములు కొంచెము రద్దీవుండును. మంగళ, బుధ, గురు వారములో ఖాళీగానుండును. Main Road మీద చాలా భోజనహటళ్లు వున్నవి. అందులో మనతెలుగువారిది ఒక పెద్దహోటల్ వున్నది. అచట మన ఆంధ్రా భోజనము ఫలహారములు లభించును.

వెరుల్ గ్రామములో కొని ధర్మశాలలు, సత్రాలు, వున్నవి అచ్చట రూములు కొంచెము తక్కువ రేటులో లభించును కాని సౌకర్యము తక్కువగావుండును. మనము రాత్రి నిద్రించవలెనన్న ఎల్లోరా వద్దగాని వెరుల్ గ్రామములోగాని బసచేయవచ్చును. దేవగిరి పర్వతశ్రేణువులలో వేంచేసియున్న దివ్య క్షేత్రము ఘృష్ణేశ్వర్. స్వామి ఆలయమునకు చుట్టూ పెద్ద ప్రహరీగోడ వున్నది. ద్వారములు మాత్రము చిన్నవి. ఆలయప్రాంగణము చాలా విశాలమైనది. ఘృష్ణేశ్వర స్వామి గర్భాలయము భూమిలోపలికి వుండును. మెట్లద్వారా క్రిందికి దిగి స్వామి వారిని సేవించవచ్చును. మనము స్వయముగా స్వామి వారిని తాకి పూజించవచ్చును. అచ్చట పూజారులందురు మనకు కావలసిన పూజలు

అభిషేకముచేయుదురు. స్వామి వారి గర్భాలయమునకు ఎదురుగా నందిమంటపము వున్నది. పార్వతీ అమ్మవారు గర్భాలయములోనే నెలకొని యున్నారు. 30 లేదా 40 మంది ఒకేసారి గర్భాలయుములో కూర్చోని స్వామివారిని ప్రార్ధించుకొనవచ్చును. ఆలయప్రాంగణములో కూర్చోని స్వామిని స్మరించుచుంటే వచ్చే అనుభూతి వర్ణనాతీతము.

అచ్చట బిల్వపత్రములు లభించును. మనము బిల్వపత్రములతోను జలము లేదా పాలతోను స్వయముగా అభిషేకము చేసికొనవచ్చును. పర్వదినములలో లేదా శుక్ర, శని,ఆదివారములలో కొంచెము రద్దీవుండును. శివరాత్రికి మాత్రము ఎక్కువ రద్దీవుండును. ఆలయము బయట ఒక కోనేరువున్నది. అది చాలా పవిత్రమైనది. అందులో అనేక పార్ధివలింగములు నిమజ్జనము చేయబడినవి. అదే తీర్ధముగా మనము సేవించియింటికి తెచ్చుకొనవచ్చును.

**స్థలపురాణము :**

దేవగిరి పర్వతశ్రేణువులలో నొకానొక గ్రామములో సుధర్ముడను గొప్ప శివభక్తుడు సుధేహ అను ధర్మపత్నితో శ్రీశివదేవుని వేదోక్త ధర్మముగా సేవించు చుండెను. కాని వారికి సంతానభాగ్యము కలుగలేదు. తోటి స్త్రీల యొక్క గొడ్రాలు అను సూటీపోటీ మాటలతో ఆమె మనసు గాయపరచుచుండిరి. ఆమె తనకు సంతానము కలుగదని నిశ్చయించి తన చెల్లెలైన ఘష్మాదేవిని సంతానార్ధము వివాహముచేసికొమ్మని బలవంతపెట్టసాగెను. విధి విధానముగా సుధర్ముడు వివాహము చేసికొనెను.

ఘష్మాదేవి అక్కగారి యొక్క అనుమతితో ప్రతిరోజు 101 పార్ధివ (మట్టితో) లింగములను తయారు చేసి పూజలొనరించి తదుపరి చెరువులో నిమజ్జనము చేయుచుండెను. లక్ష పార్ధివలింగములను ఆవిధముగా తమరుచేసి పూజానంతరము కోనేటిలో నిమజ్జనము చేసెను. శ్రీశివదేవుడు ఆమె యొక్క పూజకు సంతసించి ఒక కుమారుని ప్రసాదించెను.

కుమారుడు జన్మించిన అనంతరము ఘష్మాదేవికి సంఘములో విలువ పెరుగసాగెను. కాని ఆమె అది ఏమి పట్టించుకొనక శ్రీశివదేవుని ఆరాధనలోనే నిర్వికారముగా కాలముగడుపు చుండెను. అక్కగారైన సుధేహకు కొంచెము కొంచెముగా ఈర్ష్య పెరగజొచ్చెను. ఆ పిల్లవాడు పెరిగి పెద్దవాడైన తదుపరి తండ్రి అయిన సుధర్ముడు వివాహము నొనర్చను.

ఆ కుమారుడు భార్యతోటి ఆనందముగా కాపురము చేయుజుచ్చెను. ఘూష్మాదేవికి ఏమిపట్టుకుండెను. కాని సుధేహకు మాత్రము అసూయ ఎక్కువయై ఒకనాటి రాత్రి ఆ కుమారుని చంపి ముక్కలుగా కోసి పర్దివలింగములు నిమజ్జనమైన కోనేటిలో పారవేసి ఏమీ తేలియని దానివలె నటించసాగెను.

భర్తను కానిదై కోడలు ఏడువనసాగెను. అది వినినను ఘుష్మాదేవి ఏమియు చలించకుండా 101 పార్దివ లింగముల పూజను గావించుచుండెను. పూజానంతరము మహాదేవుని స్మరించుచు ఆపార్థిలింగములను కోనేటిలో నిమజ్జనము చేసి వెనుతిరిగిన వెంటనే ఆమెకు కుమారుడు కన్పించెను. ఆమె తన కుమారుడు మరణించినపుడు తిరగి పునర్జీవితుడుఐనపుడును నిర్వికారిగానుండెను. అపుడు ఆమె భక్తికి నిగ్రహశక్తికి సంతసించి శ్రీ శివదేవుడు ప్రత్యక్షమై ఆమెను వరము కోరుకొమ్మనెను. అంతట ఆమె శ్రీశివదేవుని భక్తులను రక్షించుటకును కొర్కెలు తీర్చుటకునుగాను తనపేరుతో జ్యోతిర్లింగరూపమున అచట వెలయుము అని కోరుకొనెను. ఆమె కొర్కెప్రకారము శ్రీశివదేవుడు శ్రీ ఘృష్ణేశ్వరునిగా జ్యోతిర్లింగరూపమున వెలసెను. పార్థివలింగములు నిమజ్జనము జరిగిన కోనేటికి శివాలయము అని ప్రశిద్దిపొందినది. శివాలయమును కోనేరు చాలా పవిత్రమైనది. దర్శనము మాత్రమున కోరిన కోర్కెలు నెరవేరును.

ఇచ్చటనే వున్న ఎల్లోరా గుహలు ప్రపంచ ప్రఖ్యాతిగాంచినవి. ఈ గుహలు ముఖ్యముగా బౌద్ధ, హిందూ జైనమతముల దేవాలయములతో అలరారుచున్నవి. ఇవి మొత్తము 34 గుహలు. 17 హిందూ మతానికి 12 బౌద్ధమతానికి 5 జౌనమతానికి సంబంధించిన అలయాలు. ఈ ఆలయాలన్నీ కొండపైనుండి క్రిందకు తొలుచుకుంటూ పోయినవి. వీటిలో 16వ గుహకైలాస గుహ తప్పక చూడవలసినది. ఎల్లోరా గుహలగూర్చి వ్రాయాలంటే అది ఒక పుస్తకము అవుతుందికనుక ఇంతటితో ముగిస్తున్నాను. ఘృష్ణేశ్వరస్వామి దర్శనానికి వెళ్ళినపుడు కొద్ది సమయము ఎల్లోరా గుహాలయముల దర్శనానికి కేటాయించుట మంచిది ఎందుకంటే ఆ గుహాలయముల కోసమువేరుగా ప్రయాణము చేయనవసరములేదుకను. అలాగుననే ఘృష్ణేశ్వరంకు వచ్చేటపుడు ఔరంగాబాద్ దౌలతాబాద్ దేవగిరి Fort)లను దర్శించుకోవచ్చును ఇచ్చటకు దగ్గరలోనే అజంతా గుహలు కూడా వున్నవి..

# సోమనాధ జ్యోతిర్లింగదర్శనము

1. ఎల్లోరానుండి 'కన్నాడ్' 'చాలీస్‌గామ్' మీదుగా 'ధూలే' చేరవలయును.
2. Dhule 'ధూలే' నుండి Sakari 'సక్రీ — hivel 'ధహీవెల్' — Navapur 'నవాపూర్' — Songadh 'సొనెగడ్'— Surat సూరత్ — సూరత్ వెళ్లకముందే NH-8 వచ్చును (షుమారు సూరత్ 20 K.M వుండగానే నేషనల్ హైవే '8' వచ్చును.
3. N.H '8' మీద సరాసరి Vadordara (పూర్వము బరోడ అని పిలువబడేది) కు వెళ్ళవలయును. ఈ మధ్యలో Bharuch 'బ్రోచ్' — Ankaleswar 'అంకలేశ్వర్' వచ్చును N.H '8' Bypass రోడ్డుగావెళ్ళును. బరోడా city లోనికి వెళ్ళకుండానే Bypass లో నున్నది N.H. '8'.
4. Vadodara నుండి N.H. '8' వసాధ్ (Vasad) – ఆనంద్ (Anand) — నడియద్ (Nadiad) ఖేడా (Kheda) మీదుగా అహమ్మదాబాద్ (Ahamadabad) చేరవలయును. పైన చెప్పిన Town లోనికి వెళ్లకుండా N.H. '8' వెళ్లును.
5. అహమ్మదాబాద్ (Ahamadabad) నుండి — N.H. '8' మీదుగా - 'బగోద్రా' (Bagodra) — లింబ్డి (Limbdi) — సయిలా (Sayala ) — Choila ఛోటీంలా బామన్ బోర్ (Bamanbode) కు చేరవలయును - అచ్చటనుండి N.H. '8B' మీదుగా రాజకోట్ (Rajkot) — N.H. '8B' గోండా (Gonda) — జేటిపూర్ (Jetipur) వరకు N.H.'8B' వెళ్లును. — అచ్చటినుండి State Roadsలో వెళ్లవలయును. Jetipur నుండి జూనాగఢ్ (Junagadh) — 'కేషూ' (Keshoo) – — వీరావల్ (Viraval) — సోమనాద్ (Somanath) చేరవలయును.

1. ఎల్లోరా (Ellora) — ధూలే (Dhule) — 118 K.M
2. ధూలే (Dhule) — N.H.8 Near Surat సూరత్‌కు ముందు నేషనల్ హైవేవరకు 205 K.M
3. Surat దగ్గర N.H. '8' నుండి —Vadodara (బరోడా) (వడోదరా ) 145 K.M
4. Vadodara (వడోదరా) (Baroda) N.H.8 — Ahamadabad (అహమ్మదాబాద్) 120 K.M
5. అహమ్మదాబాద్ – 8. N.H 8A' (రాజ కోట్ మీదుగా) సోమ్‌నాద్‌కు 402 K.M



సోమనాధ్ జ్యోతిర్లింగము

**Note :** (సోమనాద్ క్షేత్రానికి Train మీద ప్రయాణము చేయవలయునన్న విజయవాడ నుండి అహమ్మబాద్‌కు Direct Train వుంది. అహమ్మదాబాద్ నుండి విరావల్ (సోమనాద్‌కుదగ్గర)కు రైలు మార్గమున్నది. లేదా బొంబాయి - నాసిక్‌లకు చేరిన అచ్చటనుండి రైలు మార్గమున్నది.

విరావల్ (Viraval) కు చేరిన తరువాత బాల్కాఘాట్ మీదుగా సోమనాద్ చేరవలయును. వీరావల్ నుండి సోమనాద్ 10 K.M లోపునే వుండును. వెళ్ళుదారిలో బాల్కాఘాట్ అను చిన్న వూరు వచ్చును. ఆ ప్రదేశము చాలా ప్రాముఖ్యము చెందినది. శ్రీకృష్ణపరమాత్ముడు భౌతికశరీరమువిసర్జించుటకు ముందుగా ప్రభాస తీర్ధమునకు వెళ్ళుచూ బాల్కాఘాట్ వద్ద విశ్రాంతి తీసికొనుచుండగా ఒక బోయవాడస్వామి వారి పాదాలను తప్పుగా అర్ధము చేసుకొని బాణము వదలగా అది స్వామి వారి బ్రొటనవేలుకు తగిలెను. తదుపరి శ్రీకృష్ణుడు అచ్చోటనే శరీరము విసర్జించెను. ఆయన భైతిక కాయాన్ని ప్రభాస తీర్థములో దహన సంస్కారాలు జరిపినారు. ఆ ప్రదేశమును మనము దర్శించుకోవచ్చును. ఆ స్థలానికి ప్రక్కగానే బలరాముడు తన స్వరూపమైన ఆదిశేషుని రూపములో ఒక సొరంగము ద్వారా భూమిలోనికి ప్రవేశించి అచటినుండి సముద్రములోనికి వెళ్ళెను అంటారు. ఆ సొరంగమును ఒక రాతితో మూసి వుంచినారు. ఆ స్థలము కూడ దర్శనీయమైనది. ఈ ప్రభాసతీర్థము సోమనాద్‌కు షుమారు 4 కిలోమీటర్ల దూరము

వుండును. ప్రతిభక్తుడు తప్పక దర్శించవలసిన పూరాణ ప్రసిద్ద స్థలము. కపిల - హిరణ్య - సరస్వతీ నదులసంగమమే ప్రభాస తీర్థము. దీనినే త్రివేణి సంగమము అని కూడా అందురు. ఈ నదీ సంగమము యిచ్చటనే అరేబిమహాసముద్రములో కలియును.

మనకు చారిత్రకముగా ఘజనీ మహమ్మదు. 17 సార్లు సోమనాద్ మీదకు దండయాత్రచేసాడు అని అంటారు. కానీ విచక్షణాజ్ఞానముతో ఆలోచించిన ఒకే ప్రదేశమును 17 సార్లు దండయాత్ర చేయాలంటే ఘజనీ మహమ్మదుకు ఆఫ్ఘనీస్థాన్ నుండి వ్యయ ప్రయాసలతో ప్రయాణము చేయుటకు కనీసము 25 నుండి 30 సంవత్సరము కాలములో ఈ దండయాత్ర చేసి వుండవలయును.

మరియు ఈ రోజున చూచినను సోమనాద్ క్షేత్రము సారవంతమైన ప్రదేశములో లేదు. ఒక్క ప్రక్క సముద్రము, మిగిలిన ప్రక్కల ఇసుకభూములు. కనుక సోమనాద్ మందిరము ధనవంతమైనది కాకుండవుండవచ్చును. సామాన్యముగా శ్రీశివదేవుని మందిరములలో అధికధన సంపద వుండదు. అక్కడకు దగ్గరలో షూమారు 140 K.M దూరములో నున్న ధ్వారకను ఘజనీమహమ్మదు కొల్లగొట్టలేదు. ధ్వారకలో శ్రీకృష్ణ మందిరములో అధికమై బంగారము వజ్రవైడూర్య సంపదవున్నా ఆ మందిరముజోలికి పోలేదు. కాని సోమనాధ్ మీదకే 17 సార్లు వచ్చినాడంటే వేరే కారణము వుండివుండవచ్చును. ఇతడు 17 సార్లు వచ్చి వెళ్ళిన తరువాత స్వయంభూజ్యోతిర్లింగము ఆ చూకి తెలియలేదు అంటే అతడు ఆ జ్యోతిర్లింగమును పెకలించి తీసికొని వెళ్లివుండవచ్చును. దీనినిబట్టి చూడగా ఘజనీ మహమ్మద్ సోమనాద్దేవాలయానికి దోచికొనుటకు వచ్చినట్టు కన్పించుటలేదు. మనహిందువులు దర్గాలకు మహమ్మదీయులుమనదేవాలయములకు ఈరోజున వెళ్ళుయున్నట్లు ఘజనీమహమ్మద్ సోమనాద్ మందిరానికి దర్శనార్ధమువచ్చి వుండవచ్చును. తదుపరి 17వ పర్యాయము అప్పుడు వయస్సు రీత్యా ఇంకారాలేను అనుకొని జ్యోతిర్లింగమును తన రాజ్యానికి తరలించి వుండవచ్చును. అవిధముగా సోమనాధ జ్యోతిర్లింగము అచ్చటనుండి మాయమై వుండవచ్చును. శ్రీ వెంకటేశ్వరస్వామి భార్యగా అందరి ఆమోదముద్ర పొంది బీ బీ నాంచారి ఘజనీమహ్మద్ యొక్క కూతురు అయివుండుటకు ఆస్కారమున్నది. ఇది పూర్తిగా రచయిత అభిప్రాయము.

**స్థలపురాణము :**

పూర్వము బ్రహ్మదేవుని మానసపుత్రుడైన దక్షప్రజాపతికి 27 గురుపుత్రికలుకలరు వీరి పేరు మీదే నక్షత్రములున్నవి. అవి అశ్వని మొదలు రేవతి వరకు వున్నవి. దక్షప్రజాపతి

వీరిని చంద్రునకు యిచ్చి వివాహాముచేసెను. చంద్రుడును వారిని మొదట సమానముగా చూచినను కాలక్రమేణ రోహిణిని మాత్రము ఎక్కువ అనురాగముతో చూచుచు మిగిలిన వారిని పట్టించుకొనకవుండెను. ఇది భరించలేక వారు తమ తండ్రి అయిన దక్షునకు విన్నవించిరి. దక్షుడు మొదలగు వారు చంద్రునకు ఈ పద్ధతి తప్పు అని చెప్పిరి. అయినను చంద్రుడు వారి హితములను లెక్కచేయక రోహిణితో మాత్రము అనురాగముతో నుండెను. అది చూచి దక్షుడు కోపముతో చంద్రునిక్షయరోగగ్రస్థుడవుగమ్మని శపించెను.

శాపవశమున చంద్రుడు క్షయరోగముతో క్షీణిచమొదలిడెను. అట్టి తరి చంద్రకాంతి లేకపోవుటచే ఔషధులు పుష్పములు ఫలించకుండెను. తదుపరి యజ్ఞయాగాదులులకు భంగమువాటిల్లెను. ఆ విధముగా ప్రకృతి సమతుల్యము దెబ్బతినెను. మహర్షులు దేవతలు దీని నివారణోపాయము కొరకు బ్రహ్మదేవుని ప్రార్థించి వారికి తమ కష్టములు విన్నవించిరి.

అపుడు బ్రహ్మదేవుడు వారికి నొక వుపాయముచెప్పెను. చంద్రుని వెంట తీసికొని ప్రభాస తీర్థమునకు వెళ్లి శ్రీశివదేవుని పార్థివలింగమునకు మహా మృత్యుంజయమంత్రానుష్టానముగా కొంతకాలము సేవించవలెనని చెప్పెను. వారు ఆవిధముగానే ప్రభాస తీర్థమున చంద్రునిచే ఆ మహామృత్యుంజయ మంత్రముతో శ్రీ శివదేవుని ఆరాధింపజేసిరి. దానితో శ్రీ శివ దేవుడు కరుణించి చంద్రునికి ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనెను. అపుడు చంద్రుడు తనను క్షయరోగమునుండి విముక్తునిగావింపుమని ప్రార్థించెను. కృష్ణ పక్షమున కళలు ఒక్కొక్కటి తగ్గుచు శుక్ల పక్షమున ఒక్కొక్క కళ పెరుగుచుండునట్లు సృష్టి వున్నంతకాలుముండునట్లు వరమునిచ్చెను.

తదుపరి చంద్రుడు శ్రీ శివదేవుని అనేక విధములుగా ప్రార్థింపగా శ్రీ శివదేవుడు ప్రసన్నమై ప్రభాసతీర్థము యొక్క గొప్పతనము చంద్రుని యొక్క కీర్తి చిరస్థాయిగా నుండుటకుగాను శ్రీ సోమనాధునిగా అచటజ్యోతిర్లింగరూపముతో ప్రభవించి భక్తులకు కల్పతరువై వారి యొక్క కుష్ఠు - క్షయ మొదలగు భయంకరమైన వ్యాధులనుండి రక్షించుచుండెను. ఈ నాటికి ఎవరైనా అయా బాదలతోనున్న సోమానాద్‌లో మహామృత్యుంజయమంత్రమును 6 మాసములు దీక్షతో పఠించిన వారు వారి యొక్కబాధలనుండి విముక్తులమ్యేదురు. ఎందువలననంటే మహమ్మదీయుడైన ఘజనీ

ఈ ఆలయమునకు వచ్చి ప్రార్ధనలు చేసినందున కోపములో ఆయనతదుపరి వచ్చిన కొందరు మహమ్మదీయులు అచటనున్నదేవాలయములను ధ్వంసముచేసెను. కాలముతో బాటు హిందూరాజులు నిర్మించిన ఆలయములు దాడులకు గురియినవి. కాని అదే ప్రదేశములో షుమారు మూడువందల సంవత్సరముల క్రితము రాణి అహల్యాబాయి అను రాజపుత్రరాణి ఒక ఆలయమును కట్టించి లింగప్రతిష్ట భూగృహలో చేసెను. అదే ఆలయములోపైన అంతస్తులో ఒక లింగము కూడ ప్రతిష్టచేసినది. ఎవరైనా దండయాత్ర చేసినను పైన వున్న లింగమును మాత్రమే ధ్వంసము చేసినను భూగృహములోనున్న జ్యోతిర్లింగము క్షేమముగా నుండునట్టు ప్రతిష్టచేసినది. ఆలయముయిప్పటికి సోమనాద్‌లోనున్నది. బారతదేశమునకు స్వతంత్ర్యము వచ్చిన తరువాత శ్రీ వల్లబాయి పఠేల్, గుల్జారీలాల్ నందా మొదలగువారు పఠాధిపతుల పర్యవేక్షణలో అసలు జ్యోతిర్లింగస్థానమును నిర్దేశించి అచట సోమనాదుని జ్యోతిర్లింగ ధ్యేయముతో ప్రతిష్ఠాపనచేసి అతిపెద్ద దేవాలయము నిర్మించిరి. అదియే అందరి పూజలు ఆరాధనలు అందుకొనుచున్నవి. శ్రీపరశురాముడు కొంతకాలము ఈ ప్రభాసతీర్ధములో తపస్సు సాగించెను. ఈ క్షేత్రము వుండుటకు అన్ని వసతులువున్నవి. హోటల్సు - గెష్టు Houses వున్నవి ధర్మశాలలు కూడా వున్నవి కాని ఛార్జీలు చేయుదురు. ఆలయముదగ్గరలోనే ఒక మ్యూజియముకూడా నున్నది. చాలా ముఖ్యమైనది. తప్పక దర్శించుకొనవలయును.

# నాగేశ్వరజ్యోతిర్లింగ దర్శనము

| | | | | |
|---|---|---|---|---|
| 1. సోమనాద్ నుండి | —— | పోర్‌బందర్ | —— | 85 K.M. |
| 2.. పోర్‌బందర్ నుండి | —— | ద్వారక | —— | 80 K.M |
| 3. ద్వారక నుండి | —— | నాగేశ్వర్ | —— | 17 K.M |
| | | **షుమారు** | | 182 K.M |

సోమనాద్ నుండి విరావల్ వరకు అచ్చటనుండి పోర్‌బందర్ (మహాత్మాగాంధీగారి జన్మస్థలము) అచటనుండి ద్వారక పట్టణమునకు అచటనుండి నాగేశ్వర్ జ్యోతిర్లింగమునకు ప్రయాణము.

ప్రయాణము చాలా వరకు సముద్రమునకు దగ్గరగా రోడ్డువరుసన జరుగును. ప్రయాణము చాలా ఆహ్లాదకరముగా నుండును. Interest వున్నచో పోర్‌బందర్‌లో



నాగేశ్వర జ్యోతిర్లింగము

శ్రీ గాంధీ గారి జన్మస్థలము మ్యూజియం మొదలగునవి దర్శించవచ్చును. అట్లే కృష్ణసుధామమందిరము కూడ దర్శించవచ్చును. పోర్‌బందర్‌నుండి ద్వారకకు వెళ్ళవలెను. సప్తపురులలో ఒకటి అయిన ద్వారక పురాణ ప్రసిద్ధి చెందినది. ఈ ద్వారకానగరము శ్రీ కృష్ణపరమాత్మని యొక్క సామ్రాజ్య రాజధాని. శ్రీకృష్ణుని అంతఃపురము బేట్ ద్వారక. ఇది సముద్రములోనున్న ఒడ్డునుండి 5 K.M సముద్రము మీద స్టీమరు మీద వెళ్లవలెను. బేట్ ద్వారకాకు ద్వారకకు మధ్యన వున్న దేమన నాగేశ్వరజ్యోతిర్లింగము.

అన్ని జ్యోతిర్లింగ క్షేత్రముల వలే కాకుండా ఈ క్షేత్రము మాత్రము ప్రత్యేకత ఏమిటంటే ఈ క్షేత్రము ఒక గ్రామములోగాని పట్టణములోగాని వుండదు. ఇది వున్న ప్రదేశమును దారుకావనము అందురు. చుట్టుప్రక్కల ఇండ్లు గాని షాపులుగాని వుండవు. ఇప్పుడిప్పుడే కొంచెము కొంచెముగా Develop అగుచున్నది. ఆలయముచుట్టు ప్రహరీ గోడ వున్నది. స్వామి వారి ఆలయము ఆ ప్రహరీలోపలనున్నది. గర్భగుడికి మెట్లమీదుగా క్రిందకు దిగివెళ్లవలయును. స్వామివారి గర్భాలయములో స్వామివారు వేంఛేసియున్నారు. అమ్మవారు గోడలో నిక్షిప్తమైయున్నారు. నాగేశ్వరజ్యోర్లింగముసాలిగ్రామశిలగానున్నది. గర్భాలయము పడమర ముఖముగానున్నది. అమ్మవారి నామధేయము నాగేశ్వరీ దేవి.

పూజారి గారి కుటుంబము మాత్రమే ఆలయములోనే నివశించుచున్నారు. మనము చేసికొను పూజలకు వారు ఎల్లప్పుడు అందుబాటులో వుండును. భక్తులు ఒక్కరే కావాలంటే గర్భాలయము నందు కూర్చోని మనసారాస్వామిని సేవించుకొవచ్చును. అంత తృప్తిగా ఏకాంతముగా ఇంకా ఏ ఆలయుములలో మనము జ్యోతిర్లింగమును సేవించనవకాశము కలుగదు. ఇచ్చట మాత్రమే అవకాశమున్నది. ఆలయప్రాంగణము నిశ్శబ్ధముగా నుండును. నెమళ్ళు అక్కడకు ఎక్కువగా వచ్చును. ఆలయప్రాంగణము బయట ఒక కోనేరు రూపముగా సరస్వతీ నదినిల్చినది. అందులోని జలము స్వామివారికి అభిషేకము చేయుదురు.

యాత్రికులు వుండుటకు సౌకర్యములు చాలా చాలా తక్కువ. అందుకనేవారు ధ్వారకలోనే హోటల్‌లోగాని ధర్మశాలలలోనే వుండి దారుకావన జ్యోతిర్లింగ దర్శనముచేసి కొనుటకు బాగుండును. ఈ ధ్వారకలోనే శ్రీ ఆదిశంకరాచార్యులవారు స్థాపించిన నాల్గు పీఠాలలో ఒకటి వున్నది. తప్పక దర్శించవలసిన క్షేత్రము.

శ్రీ నాగేశ్వరజ్యోతిర్లింగ క్షేత్రములో భోజన, నివాస, అవాకాశములు లేనందుననే ధ్వారక పట్టణములోనే వుండుట మంచిది.

అచ్చటి వరకు వెళ్లినందున శ్రీకృష్ణపరమాత్ముని అంతఃపురమైన బేట్‌ధ్వారకను కూడ దర్శించిన బాగుండును. ఇది యాత్రికలు అభిప్రాయము మీద ఆధారపడివుండును. కొందరు నాగేశ్వరజ్యోతిర్లింగము మహారాష్ట్రలోనున్న నాగనాద్ మరియు దేశములో యితర ప్రదేశములలోనున్న వివిధ దేవాలయములందురు. కాని ఈ దారుకావనములో వేంచేసియున్న స్వామి వారి ఆలయములోనే నాగేశ్వరజ్యోతిర్లింగము నెలకొనియున్నది.

## స్థలపురాణము :

పూర్వము పశ్చిమ సముద్రతీరమున (అరేబియా సముద్రము) 16 యోజనములు గల ఒక వనముగలదు. అందుదారుక అను రాక్షసి తన భర్తతోను, యితర రాక్షసులతోను కలిసి నివశించుచుండెను. దారుక పార్వతీదేవిని గూర్చి తపస్సు చేసి అమ్మవారిని ప్రసన్నురాలిగా చేసికొని అనేక వరములు పొందెను. ఆ వరబలగర్వముచే దారుక ఆ వనమును గాలిలోనికి లేపుచు తనకు యిష్టమువచ్చిన చోట వుంచుచు భక్తులను మునులను వారువారు చేయు యజ్ఞయాగాదులను ధ్వంసము చేయుచు, ప్రజలను

భక్షించుచు కాలము గడపుచుండెను. భక్తులు ప్రజలు ఆ రాక్షసుల బాధలను భరించలేక ఔర్యమునిని రక్షింపమనివేడుకొనిరి. అప్పుడు ఔర్యముని రాక్షసులు గాని ఈ భూమి మీద ఎవరినైన బాదించినను లేదా సంహరించినను మరణించుదురుగాక అని శాపముయిచ్చెను.

దీనితో రాక్షసులు నిస్సహాయులై యుండిరి. అపుడు దేవతలు వారి మీదకు దండయాత్రకు రాగా దారుకారాక్షసి ఆవనమును గాలిలోనికి లేపి సముద్రము మీద ప్రతిష్టించెను. ఇక అచ్చటనే యుండి సముద్రము మీద వెళ్లునావల్లను దారి మళ్లించి అందులోని వారిని బందించుచు భక్షించమొదలుపెట్టిరి ఒకనాడు ఒక నావలోని వారిని బంధించి చెరసాలలో నుంచిరి. చరసాలలో నున్నవారిలో సుప్రియుడు' అన్న ఒక వైశ్యుడు శ్రీశివదేవుని భక్తుడు. అతడు చరసాలలోనుండియు శ్రీశివదేవుని యదాప్రకారము భస్మదారియై పూజించుచుండెను..తనతోటి వారికిని పారిర్థలింగ పూజలకుపురిగొల్పెను. అందరును యధావిదిగా పంచాక్షరీమంత్రముతో శ్రీ శివదేవుని పూజించుచుండెను.

ఆ భక్తుల పూజలకు శ్రీ శివదేవుడు సంతశించివారి యొక్క పూజలను స్వీకరించుచుండెను. ఒకనాడు దారుకారాక్షసి యొక్క భర్తయైన దారుకాసురుడు ఈ విషయము తెలిసికొని సుప్రయుని సంహరించుటకు వచ్చెను. సుప్రియుడు భయపడక శ్రీ శివదేవుని యధావిధిగా ప్రార్థించుచుండెను. శ్రీ శివదేవుడు భక్తులయందు అపరిమితమైన ప్రేమకలవాడు కనుక వెంటనే ప్రత్యక్షమై దారుకాసురుని ఇతర రాక్షసులను సంహరించెను మరియు ఈ దారుకావనములోనున్న వారు శివనిష్ఠా గరిష్టులై శివధర్మప్రచారకులై ముని వృత్తి అవలంబించుచుందురు గాక అని వరము నిచ్చెను. దారుకారాక్షసి దీనురాలై అమ్మవారిని ప్రార్థించగా అమ్మవారు ప్రత్యక్షమవగా తనవంశమును కాపాడమని కొరెను. అమ్మవారును వంశము రక్షింతునని అభయమిచ్చెను. ఇట్లు పార్వతీ పరమేశ్వరుల సామరస్యము భంగపడినందున అమ్మవారు స్వామివారి వరము కలియుగాంతమున సిద్ధించుగాక అనియు అంతవరకు తమోగుణము కలిగిన జనులు ఇచ్చట జన్మించుదురుగాక అనెను. శ్రీ శివదేవుడు కూడ ఇట్లు, వరమునిచ్చెను. వర్ణాశ్రమ ధర్మమును పాటించు మానవుడు యిచ్చోటకు విచ్చేసి తనను తనను సేవించిన వానికి ముక్తి కల్గును అని వరమిచ్చెను. ఈ విధముగా పార్వతీ పరమేశ్వరుల ఇరువురి వరములు సఫలమగుచున్నవి.

దారుకావనము నందు నాగేశ్వరీ నాగేశ్వరులుగా అమ్మవారు స్వామివారు స్థిరనివాసులు అయిరి. ఇది యే నాగేశ్వరజ్యోతిర్లింగము.

# శ్రీ మహాకాళేశ్వరజ్యోతిర్లింగము ఉజ్జయిని (అవంతిపురము)

నాగేశ్వర జ్యోతిర్లింగదర్శనానంతరము తిరిగి ద్వారకురావలయును మన ప్రయాణము మహాకాలేశ్వరజ్యోతిర్లింగమునకు ఆయననే మహాకాలుడు - మహాకాళేశ్వరుడు అందురు. ఆయన ఉజ్జయినీ పట్టణములో వేంచేసియున్నారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | నాగేశ్వర జ్యోతిర్లింగము | —— | ద్వారకా | —— | 17.K.M |
| 2. | ద్వారకా | —— | జామ్‌నగర్ | —— | 144 K.M |
| 3. | జామ్‌నగర్ | —— | ధరోల్ | —— | 37 K.M |
| 4. | ధరోల్ | —— | రాజకోట్ | —— | 51 (N.H. 8 B) |
| 5. | రాజకోట్ | —— | బాయన్ మిోజోరీ | —— | 30 K.M |
| 6. | బామన్‌బోరి | —— | ఛోటీలా | —— | 18 K.M |
| 7. | ఛోటీలా | —— | సాయిలా | —— | 36 K.M |
| 8. | సాయిలా | —— | లింజేడీ | —— | 35 KM |
| 9. | లింబేడీ | —— | బగోద్రా | —— | 43 |
| 10. | బగోద్రా | —— | అహమ్మదాబాద్ | —— | 51 |
| | | | షుమారు | | 462 K.M |
| 11. | అహమ్మదాబాద్ | —— | ఖేడా | —— | 37 |
| 12. | ఖేడా | —— | నడియాడ్ | —— | 21 |
| 13. | నడియాడ్ | —— | ఢాకోర్ | —— | 32 |
| 14. | ఢాకోర్ | —— | సెవాలియా | —— | 23 |
| 15. | సెవాలియా | —— | గోధ్రా | —— | 27 |
| 16. | గోధ్రా | —— | ధాహూ | —— | 60 |
| 17. | ధాహూ | —— | జజూవా | —— | 30 |
| 18. | జజువా | —— | సర్దార్‌పూర్ | —— | 40 |
| 19. | సర్దార్‌పూర్ | —— | ధార్ | —— | 33 |
| 20. | ధార్ | —— | నగ్‌డా | —— | 23 |
| 21. | నగ్‌డా | —— | బద్‌నవార్ | —— | 30 |
| 22. | బద్‌నవార్ | —— | బార్‌నగర్ | —— | 18 |
| 23. | బార్‌నగర్ | —— | ఉజ్జయిని | —— | 45 |

నాగేశ్వర్ నుండి ఉజ్జయినమహాకాల్‌కు షుమారు 881 K.M

మహాకాళేశ్వర్ జ్యోతిర్లింగము మహాకాళి

గుజరాత్ రాష్ట్రములో రోడ్లు చాలా బాగుండును. ద్వారకలో ఉదయమే బయలుదేరినచో సాయంత్రమునకు అహమ్మదాబాద్ జేరి అచ్చట ఆరాత్రి విశ్రాంతి తీసికొని మరుసటి దినము ఉదయమే బయలుదేరిన సాయంత్రమునకు ఉజ్జయినీ పట్టణము చేరుదుము. ఉజ్జయినీ పెద్ద పట్టణము రైల్వేస్టేషనుకు ఎదురుగా మంచి లాడ్జీలు వున్నవి. స్వామివారి ఆలయమువద్ద కూడా మంచి ధర్మశాలలువున్నవి. పట్టణములో యింకనే అనేక సౌకర్యములుగల లాడ్జిలు ధర్మశాలలు వున్నవి.

స్వామి వారి ఆలయము రైల్వేస్టేషనుకు 4 - 5 కిలోమీటర్ల దూరములో నున్నది. స్వామి వారి ఆలయమునకు దారి ఎవ్వరిని అడిగినను చెప్పెదరు. ఆటోల సౌకర్యము బాగుగానున్నది.

సప్తమహాపురములలో ఒకటియైన ఉజ్జయినీ నగరము (అవంతినగరము) క్షిప్రానది ఒడ్డున ఆలరారుచున్నది. మనజ్యోతిర్లింగ ప్రభువైన మహాకాలేశ్వరుడు ఈ పట్టణములో వేంచేసియున్నారు. ఆలయము బహుపురాతనమైనది. చాలా పర్యాయములు మహమ్మదీయుల దండయాత్రలో ఆలయము భిన్నమైనది. కాని తదుపరి హిందూరాజులు పునర్మిణాము చేయుచూ వచ్చిరి. ప్రస్తుతము వున్న ఆలయమును రాణోజీషిందే అను మహారాష్ట్ర మంత్రివర్యులు పునర్మిణామును చేసిరి. ఆలయము మూడు అంతస్తులుగా వున్నది. క్రింది అంతస్తులో మహకాలును యొక్క జ్యోతిర్లింగమున్నది. మనము దర్శనమునకు క్రిందికి వెళ్ళుటకు మెట్లున్నవి. విశాలమైన గర్భాలయములో స్వామి వారు వేంచేసి యున్నారు. అన్ని విధములైన పూజలు జరుగును. గర్బాలయుములో జరుగు పూజలను

భక్తులు క్యూలైనులో వెళ్లునపుడు T.V ల ద్వారా కన్నులార దర్శించవచ్చును. భక్తులకు దర్శనమునకు ఏమాత్రము కష్టముముండదు. Batch లుగా భక్తులను గర్భగుడిలోనికి వెళ్లనిచ్చెదరు. దర్శనానంతరము వేరే ధ్వారము ధ్వారా బయటకు వచ్చేదరు.

స్వామి వారిని తాకి పూజించ వచ్చును. స్వామిని తాకినపుడు శరీరము పులకించిపోవును. స్వామివారికి వెనుకగా పార్వతీ అమ్మవారి విగ్రహము గోడలోనిక్షిప్తమై యున్నది. మనము Photoలు తీసికొనవచ్చును. స్వామి వారికి తెల్లవారు ఝామున 3 గంటలకు శవవీభూతితో అభిషేకము చేయుదురు. మనము కావలెనన్న ధర్శనము చేసికొనవచ్చును. ఇది ప్రతిరోజు జరుగు ప్రధమ అభిషేకము. తదుపరి స్వామివారిని జలముతో స్నానము చేయించి మంచి గంధము పూతపూయుదురు. తదుపరి స్వామి వారికి అన్ని అలంకారములు చేయుదురు. అలంకారములు అయిన పిమ్మట స్వామివారు చాల మనోహరముగా నుందురు. పిదప అందరూ స్వామివారి దర్శనమునకు వెళ్ళవచ్చును. Ground Floor Levelలో స్వామి వారి ఆలయమునకు వెళ్లుటకు ముందుగా కుడిచేయి ప్రక్కగా పెద్ద కోనేరు వున్నది. అచ్చట తీర్దము మనము యిళ్లకు తెచ్చికొనవచ్చును. కోనేరు దగ్గర చాలా జాగ్రత్తగా వుండ వలయును. పాకుడు ఎక్కువగానుండి జారుటకు చాలా అవాకాశమున్నది కనుక చాలా జాగ్రత్తగా తీర్దమును తీసికొనవలయును. స్వామి వారి ఆలయము నుండి బయటకు వచ్చిన తరువాత Ground level లో ఓం కారేశ్వరమందిరమున్నది. ఇది చాలా ఎత్తుఅయిన పెద్దమందిరము. అందరూ దర్శించవచ్చును. పై అంతస్తులో (ఇది విడిగా ప్రత్యేకముగా నుండును). వేంచేసియున్న నాగచందేశ్వరుని (శ్రీ శివవేవుడు) నాగ పంచమినాడు మాత్రమే దర్శించుటకు వీలున్నది.. అన్ని రోజులు దర్శించవీలుగాదు.

ఇంకనూ ఉజ్జయినిలో దర్శించవలసిన దేవాలయముచాలా వున్నవి. ముఖ్యముగా శ్రీ విక్రమాదిత్య మహారాజు ప్రతిదినము దర్శించి పూజించిన హరసిద్ధి మాతామందిరము కొందరు హర్షద్ మతా అందురు. మహాకాలేశ్వరమందిరానికి కొద్ది దూరములో రుద్ర సాగర్ అనే కోనేటికి పడమటి దిక్కున వేంచేసి యున్న ఆలయమే హరసిద్ధిమాత ఆలయము. ప్రస్తుము ఈ కోనేరు ఎండిపోయివున్నది. మహారాష్ట్ర రాజులచే పునర్‌నిర్మితమైన ఆలయము ప్రస్తుతమున్నది. స్వామివారి ఆలయమునకు 5 K.M దూరములో కాళికా దేవి ఆలయమున్నది. ఈ అమ్మవారినే కవికాళిదాసు ప్రస్తుతించి ప్రార్ధించినది. అష్టదశ పీఠాలలో ఇది ఒకటి.

క్షిప్రానది ఒడ్డున భతృహరిగుహలున్నవి. భతృహరి రాజ్యాధికారమునకు వచ్చినపుడు విరక్తి భావము కల్గి రాజ్యమును తన తమ్ముడైన విక్రమాదిత్యునికివప్పచెప్పి సన్యసించి ఈ గుహలలోనే కాలము గడిపి అనేకములైన కవితలు రచించి భగవత్ సన్నిదానము పొందెను. అవే ఈనాడు మనము భతృహరి సుభాషతముగా చదువు కొందుము. ఈ గుహలదగ్గరనే శ్రీ శివదేవుని మందిరము పాతాళేశ్వరి మందిరములు నాధ్ సాంప్రదాయము కర్త అయిన మత్యేంద్ర నాద్ మందిరములున్నవి.

ఉజ్జయినీ నగరమునకు ప్రతికల్ప - కనకశృంగ - పద్మావతి - విశాల - అవంతిక అను పేర్లు వున్నవి. మహాకాళేశ్వరునకు నాలుగు ధ్వారములున్నవి. తూర్పున పింగళేశ్వరుడు పడమర దిక్కున బల్వేశ్వర - వుత్తరమున నిఖిలేశ్వర పడమర కావ్యవరోహశ్వరుడు క్షేత్రపాలకులుగా నున్నారు.

ఉజ్జయినీ క్షేత్రములోనే సందీపముని వద్ద శ్రీకృష్ణ - బలరాముడు - కుచేలుడు మొదలగు వారు విధ్య నభ్యశించిరి. ఆయన పేరున సందీపనీ ఆశ్రమమున్నది. ఈ క్షేత్రములో వేంచేసియున్న కాలభైరవుని ప్రత్యేతవున్నది. విగ్రహముచాలా పెద్దది. స్వామివారి యొక్క నొటిదగ్గర ఏవిధమైన wine (మత్తు పానీయము)ను ఒక పాత్రలో నుంచి పెట్టిన ఆయన ఆ పాత్రను కాళీ చేసెదరు. ఇది మనము కళ్ళారా చూడవచ్చును. ఇది క్షిప్రానది ఒడ్డున వున్న పెద్ద దేవాలయము. ఇంకనూ అనేకములైన పురాతన మందిరములున్నవి. 1. శ్రీరామమందిరము 2. విక్రమాదిత్యుని విగ్రహము 3. శ్రీ సంతోషీమాతా ఆలయము. 4. నాగర్ కోటీమాత 5. బరిగణేష్మందిరము. 6. గోపాల్ మందిరము 7. శనీశ్వరుని మందిరము (నవగ్రహమందిరము) 7 కొలోమీటర్ల దూరము) 8. శ్రీ జనార్ధన్ రామలక్ష్మణ్ మందిరము 9. వైష్ణవీదేవి - మానసాదేవి మందిరములు ఇంకనూ అనేకములైన జైన మందిరములున్నవి. ముఖ్యముగా ఈ క్షేత్రములో ఒక Guide ని తీసికొని పూరాతనములైన మందిరములను యితరములైన పురాణ చరిత్రప్రదేశములను దర్శించవలయును. ఓపికతో అన్ని ప్రదేశములను దర్శించవలసినది. క్షిప్రానదిలో స్నానము చేసిన సర్వపాపములు పటాపంచలగును. క్షిప్రానదికి ప్రతి 12 సంవత్సరములకు పుష్కరములు వచ్చును. అపుడు లక్షలాది భక్తులు వచ్చి స్నానము చేసి మహాకాళేశ్వరుని - హరసిద్ధి మాత మహాకాళీ మాతను దర్శించి తరించెదరు.

## స్థల పురాణము :

పూర్వము అవంతీ (ఉజ్జయినీ) నగరమున వేదప్రియుడను బ్రాహ్మణపుంగవుడు తన సంతానమైన దేవప్రియుడు - ప్రియ మేధుడు - సుకృతుడు - ధర్మవాహి అను నల్గురు పుత్రులతో నిత్యనైమిత్తిక వైదిక కర్మల ననుష్టించుచు పార్థివలింగార్చన చేయుచుండెను. వారి యొక్క పుణ్యప్రభావము వలన ప్రజలందరు సుఖసంతోషములతో అలరారుచుండిరి. తండ్రియైన వేదప్రయుని శ్రీ శివసాన్నిధ్యానంతరము పుత్రులయొక్క భక్తి తత్పరత చెక్కుచదరకుండా నిర్విఘ్నముగా సాగుచుండెను. ప్రజలు సత్ప్రవర్తనతో నుండిరి.

అదే రోజులలో రత్నమాల పర్వతముమీద దూషణుడు అను రాక్షసరాజు ధర్మద్వేషియై అకృత్యముల ఎన్నియో చేయుచుండెను. ఒక్క ఉజ్జయినీ నగరము తప్ప అన్ని లోకములులో దూషణుని ప్రవర్తనముతో యజ్ఞయగాదులు స్థంబించిపోయెను. వైదిక కర్మలు ఎప్పుడైతే లోపించినవో సృష్టి సమతుల్యము దెబ్బతినెను, చివరిగా దూషణుడు తన రాక్షస గణముతో ఉజ్జయినీ నగరములోనికి ప్రవేశించి బ్రాహ్మణమరియు యితర భక్తుల యొక్క కార్యక్రమములను స్థంబింపజేసి వారిని బాధింపజుచ్చెను. అయినను దేవప్రియుడు అజోతని సోదరులు మరి కొందరు బ్రాహ్మణులు రాక్షసులప్రవర్తనలకు వెరవకుండా శివదేవుని మీద నమ్మకముతో తమ తమ విద్యుత్ ధర్మముతో కార్యక్రమములు నిర్వర్తించుచు స్వామి వారి మీద భారము మోపి ప్రార్థించుచుండిరి. వారి పార్థివలింగ ఆరాధనయే వారికి రక్ష అన్న నమ్మకముతో నుండిరి. ఎప్పుడైతే దూషణుడు దేవప్రియుని మొదలగువారిని బాధించుటకు వచ్చెనో ఒక గుంటనుంచి శ్రీశివదేవుడు మహాకాలుని రూపముగా ప్రత్యక్షమై దూషణుని వాని అనుచరులను భస్మమొనర్చెను.

మహాకాలుడు ఆ బ్రాహ్మణ భక్తులను వరము కోరుకొమ్మనెను. అప్పుడు భక్తులందరూ ఏకకంఠముతో స్వామిని అచ్చోటనే జ్యోతిర్లింగ రూపమున నివశించమని ప్రార్థించెను. వారి కోరిక ప్రకారమూ స్వామివారు మహాకాలజ్యోతిర్లింగ రూపమున వెలసెను. అప్పటినుండి ఉజ్జయినీ (అవంతి) నగరము శివమయమై భక్తులు, భక్తులు కాని వారిని కూడ సంరక్షించుచుండెను. ప్రజలందరూ శ్రీమహాకాలుని దర్శించుచు సేవించుచూ జన్మసాఫల్యము చేసికొనుచున్నారు.

# ఓంకారేశ్వర అమలేశ్వర జ్యోతిర్లింగయాత్ర

| | | | | |
|---|---|---|---|---|
| ఉజ్జయినీ | —— | దీవాస్ | —— | 37 K.M |
| దీవాస్ | —— | ఇండోర్ | —— | 35 K.M |
| ఇండోర్ | —— | బార్వా | —— | 49 K.M |
| బార్వా | —— | ఓంకారేశ్వర్ | —— | 12 K.M |
| | | | షుమారు | 133 K.M |

అమరేశ్వర జ్యోతిర్లింగము

ఓం కారేశ్వర్‌ను గూర్చి వివరించటము అంటే జన్మ సాఫల్యము అని భావన. నర్మదానది ఒడ్డున కుడిప్రక్కన ఓంకారేశ్వరుని ఆలయము ఎడమప్రక్కగా అమలేశ్వరుని మందిరము భక్త కోటి సందర్శనతో అలరారుచున్నవి. ఓంకారేశ్వరుని అమలేశ్వరుని ఇద్దరిని ఒక్క జ్యోతిర్లింగముగా భక్తకోటి పరిగణించుచున్నది. ఈ ఆలయములు ఒకప్పుడు మాంధాత మహారాజు పరిపాలించిన సామ్రాజ్యములోనున్నవి. నర్మదానదిలో స్నానము చేసి ఓంకారేశ్వరుని దర్శమనమునకు వెళ్లవలయును. ఈ ఆలయము ఒక చిన్న పర్వతము మీద నున్నది. ఎత్తు తక్కువ గనుక అందరూ మెట్లమీద నడిచి వెళ్లి దర్శించెదరు. మందిరము చాలా మనోహరముగా నుండును. స్వామి వారి జ్యోతిర్లింగము గర్భగుడిలో మధ్యలో నుండక గోడవైపునకు దగ్గరగానుండును. స్వామివారి వెనుకగా పార్వతీ అమ్మవారి

విగ్రహము అలంకరణములతో విరాజిల్లుచుండును. తెల్లవారుఝామున నుండి పూజాకార్యక్రములు మొదలగును. అచ్చటచాలా మంది పూజారులు, పండాలుందురు. వారు మనకు కావలసిన పూజా కార్యక్రమమలు నిర్వర్తించెదురు. స్వామి వారిజ్యోతిర్లింగము మధ్య భాగమున చిన్న చీలికవున్నది. అభిషేకజలము ఆచీలిక ద్వారా నర్మదానదిలోనికి పోయి నర్మదానదిని పవిత్రత మరింత ఎక్కువ జేసినది. ఆ చీలికలో ఒక రూపాయి బిళ్లను వేసిన అది కూడా సరాసరి నర్మదా నదిలోనికి పోవును.

స్వామివారి దర్శనమునకు పోవు మార్గము (ధ్వారము) దర్శనానతంతరము బయటకు వచ్చు మార్గము (ధ్వారము) వేరుగా నుండును. అందువలన అచ్చట భక్త సందోహములు స్వేచ్ఛగా మనఃస్ఫూర్తిగా స్వామిని అమ్మవారిని దర్శించి బయటకు రావచ్చును. స్వామి వారి ఆలయములకు వెళ్లునపుడు వివిధ మందిరములు దర్శనముకల్గును. అందులో వేదమాత గాయిత్రీ అమ్మవారి పాలరాతి విగ్రహము దర్శనము మనసులో అట్లే నిలబడిపోవును. క్రిందకు మెట్లు మీద నర్మదానది ఒడ్డున నుండి అవతలి ఒడ్డునకు పడవలు నడుపుదురు. ఒక్కొక్కరికి రెండు నుండి ఐదు రూపాయిలు చార్జి వసూలు చేయుదురు భక్తుల రద్దీ ఎక్కువగావుంటే 5రూపాయిలు లేదా 2 రూపాయిలు వసూలు చేయుదురు. అవతలి ఒడ్డుకు వెళ్లి అమలేశ్వరుని ఆలయము దర్శనము చేసి కోవలయును. ఆలయము ఓంకారేశ్వరుని ఆలయము అంతవుండును. కాని జనసందోహము తక్కువగా వుండును. దర్శనము సులువుగాను సుఖముగాను కలుగును. పూజారులు వుందురు. మనకు కావలసిన పూజలను జరుపుకోవచ్చును. అన్ని చోట్లా Photos తీసికొనవచ్చును. అమలేశ్వరుని ఆలయము దగ్గరలో ఒక పెద్ద Hotel వున్నది. అన్ని సదుపాయములున్నవి. కారును సరాసరి Hotel లోనికి తీసికొని పోవచ్చును. అచటకు వెళ్లవలెనన్నా ఓంకారేశ్వరుని ఆలయమునకు వెళ్ళుటకు ముందుగా రెండు కిలోమీటర్లు దూరమునుండియే Separate రోడ్డు ద్వారా వెళ్లవలెను. ఎవ్వరిని అడిగినను దారిచెప్పెదరు. ఓంకారేశ్వర్‌లో కూడ చాలా ధర్మశాలలు చిన్న చిన్న lodges వున్నవి కాని సదుపాయములు తక్కువ.

కావేరి అనేనది నర్మదానదిలో కలిసే వుపనది. ఆ కావేరినది మాంధాతపర్వతమును చుట్టి వచ్చి నర్మదానదిలో కలియును. ఈ కలుయిక 'ఓం' ఆకారములో చుట్టి వచ్చి కలియును. ఆకాశమునుండి చూచిన 'ఓం' ఆకారములో ఆప్రవాహముండును. భక్తులు

ఆ పర్వతమును పరిక్రమమును చేయుదురు. ఆ పరిక్రమసమయములో అనేకములైన ఆశ్రమములు సాధువుల దర్శనముకలుగును. ఓంకారేశ్వరస్వామి ఆలయము దిగువనవున్న స్నానాలా ఘాట్ నుండి పడవమీద దిగువకు నర్మదానది మీద వెళ్లిన చాలా ఆశ్రమములు కన్పించును. అచట సాధువులు చాలా మంది తటస్తించెదరు. అచ్చట తెల్లజిల్లేడు చెట్లు చాలా వున్నవి కాని వృక్షముల సైజులో కూడా వున్నవి.

శ్రీ ఆది శంకరాచార్యుల వారు యిచ్చటనే తమ గురువును ఎన్నుకొన్నారు. ఒక పర్యాయము నర్మదానది పొంగి గట్టుమీద నున్న వారి ఆశ్రమమును ముంచి వేయు సమయములో శ్రీ శంకరాచార్యులవారు నర్మదానదిని తమ కమండలములోకి ఆ వాహనచేసి ఆశ్రమముముంపునకు గురిగాకుండా కాపాడిరి అని ప్రతీతి.

ఇచ్చట నర్మదానదిలో దొరికే రాళ్లను సేకరించి శివలింగములను చేయుటకు వుపయోగించెదరు. శివలింగనిర్మాణానికి నర్మదానదిలో దొరికే లింగాకార రాళ్లు ప్రశస్తమని చెప్పెదరు.

**స్థలపురాణము:**

ఒకనొక పర్యాయము నారదమహర్షి వింధ్యపర్వతములకు వెళ్లగా వింధ్యుడు నారదుని సముచిత రీతిని గౌరవించెను. ఆ సమయములో వింధ్యుని మనస్సులో తనలో సిద్ధులు గంధర్వులు కిన్నరులు కింపురుషులుండటేగాక రత్నమణి వజ్రసువర్ణాది సర్వంబునుకలదు గనుక తన కేమి కొరత లేదనుకొనుచెండెను. వింధ్యుని మనస్సులో నున్న ఆలోచనను గమనించిన నారద మహర్షి 'నీయందు అన్ని వున్నవి కాని నీ కంటే మేరుపర్వతము ఎత్తైన నది, మరియు దేవతలలో మేరువుకు స్థానమున్నది, కానీ నీకు అట్టి యోగము లేదుకదా అనెను.

అప్పుడు వింధ్యుడు తన కంటే వేరొకరు గొప్పవాడు గానుండటను సహించలేకపోయెను. వెంటనే శ్రీ శివదేవుని ఆరాధించి కృతార్థుడు కావలెనన్న పట్టుదలతో ఓంకార క్షేత్రమునకు వెళ్లి శ్రీ శివదేవుని పార్థివలింగమును తపస్సుతో నిశ్చల భక్తితో ఆరాదించెను. అపుడు శ్రీ శివదేవుడు వింధ్యునకు ప్రత్యక్షమై వరమును కోరుకొమ్మనెను. వింధ్యుడు 'స్వకార్యమును సాధించుశక్తిని ప్రసాధించమని 'శ్రీ శివదేవుని కొరుకొనెను. స్వామివారు ' నీ యిష్టమువచ్చినట్లు చేయుదువు' అని వరమునిచ్చెను.

అపుడు దేవతలు మునులు స్వామి వారిని ఓంకారశ్వరములో నివశించమని ప్రార్ధించిరి. వారి కోరికను మన్నించి ప్రణవాకారముగా ఓంకారేశ్వరుడనియు పార్థివలింగాకారముగా అమలేశ్వరుడనియు స్థిరునివాసుడై భక్తుల అభీష్టములు నెరవేర్చమొదలిడెను. ఇదియే ఓంకారేశ్వర అమలేశ్వరజ్యోతిర్లింగము.

వింధ్యుడు వర గర్వముతో తన యిష్టము వచ్చినట్లు ఎత్తు పెరుగుచు తగ్గుచూ, సూర్య చంద్రుల గమనానికి అడ్డుతగలజొచ్చెను. ఇది చూచి శ్రీశివదేవుడు శ్రీ అగస్త్య మహామునిని వింధ్యుని గర్వము అణచమని పంపెను. అగస్త్యులవారి రాకను జూచి వింధ్యుడు మర్యాద పూర్వకముగా తన ఎత్తుని తగ్గించి వారిని గౌరవించగా ; అగస్త్యుల వారు వింధ్యను దాటి దక్షిణాపథమునకు వచ్చునపుడు వింధ్యునితో తాను తిరిగివచ్చువరకు ఆ ఎత్తునకు మించి పెరగక్కుండా వుండమనెను. వింధ్యుడు సరే అనెను. కాని శ్రీ అగస్త్యుల వారు తిరిగి వుత్తరభారతమునకు వెళ్లలేదు. వింధ్యుడు మరల ఎత్తుకు పెరగలేదు.

## కాశీ విశ్వేశ్వర జ్యోతిర్లింగ దర్శనము

| | | | |
|---|---|---|---|
| 1. | ఓంకారేశ్వర్ నుండి | — బార్ వా (Barwah) | — 12 K.M. |
| 2. | బార్వా | — సనావద్ | — 14 K.M |
| 3. | సనావధ్ | — దేష్‌గామ్ (Deshgaon) | — 34 K.M |
| 4. | దేష్‌గామ్ | — ఖాండ్వా (Kandwa) | — 24 K.M. |
| 5. | ఖాండ్వా | — ఆసాపూర్ (Asapur) | — 39 K.M |
| 6. | ఆసాపూర్ | — హర్‌సద్ (Harsud) | — 21 K.M |
| 7. | హర్‌సద్ | — సిమోనిమాల్వా (Seonomalva) | — 88 K.M |
| 8. | సిమోనిమాల్వా | — హోషంగాబాద్ (Hrshangabad) | — 43 K.M |
| 9. | హోషంగాబాద్ | — పిపారియా (Piparia) | — 70. K.M |
| 10. | పిపారియా | —బద్రవారా కరేలీ(Kareli) | —102 K.M |
| 11. | కరేలీ | — నరశింహపూర్ (Narasimhapur) | — 14 K.M |
| 12. | నరశింహపూర్ | — లాఖన్‌దనే (Lakhnadon) | — 51 K.M |
| 13. | లాఖన్‌దాన్ | — జబల్ పూర్ (Jabal pur) | — 85 K.M |
| 14. | జబల్‌పూర్ | — సిహోరా (Sihora) | — 42 K.M |

| | | |
|---|---|---|
| 15. సిహోరా | — ముర్‌వారా (murwara) | — 60 K.M |
| 16. ముర్‌వారా | — మైహార్ (maihar) | — 66 K.M |
| 17. మైహార్ | — అమర్‌పటాన్ (Amarpatan) | — 24 K.M |
| 18. అమర్‌పటాన్ | — రీవా (Rewa) | — 43 K.M |
| 19. రీవా | — మంగావన్ (Mangawan) | — 31 K.M |
| 20. మంగావన్ | — మోగంజ్ (Mauganj) | — 35 K.M |
| 21. మోగంజ్ | — మీర్జాపూర్ (Mirzapur) | — 97 K.M |
| 22. మీర్జాపూర్ | — వారణాశి (కాశీ) (Varanasi) | |
| | మొగల్‌సరాయి (Mogalsarai) | — 80 K.M |
| | **మూమారు** | — 1075 K.M |

గంగానదికి ఉపనదులైన 'వరుణ' 'అసి' నదులసంగమస్థానమే వారణాశి. ఈ వారణాసి అసలు పేరు 'కాశీ' ఇదే శ్రీశ్రీశ్రీ విశ్వేశ్వర స్వామి దివ్యధామము, మనజ్యోతిర్లింగముండు స్థానము శ్రీ శివదేవునిచే సృష్టించబడి భూమి మీద అమర్చబడిన పట్టణమే కాశీనగరము. ఈ కాశీనగరము వేదకాలము చతుర్ యుగములకు కూడా ముందునుండి నున్న పుణ్యధామము. సప్తమహాపురములలో ఒకటి. 'కాశ్యంతు మరణాన్ముక్తిః ' అనే సూక్తి (కాశీలో మరణించిన తిరిగి తల్లి గర్భవాసముండదు) నిజము. ఇచట శరీరవిసర్జనచేసిన ప్రతి జీవి శ్రీ శివదేవుని యొక్క దయతో బ్రహ్మజ్ఞానము పొంది స్థిరకైలాసవాసమును పొందెదరు.

హరిశ్చంద్రమహారాజు, శ్రీ రామచంద్రమహారాజు, పాండవరాజులు, గౌతమబుద్ధుడు జ్ఞాన రాజులైన అదిశంకరాచార్యులు మొదలగువారు ఈ క్షేత్రమును దర్శించి శ్రీవిశ్వేశ్వరుని సేవించి తరించారు. హిందూ అయిన ప్రతివారికి జీవితకాలములో ఒక్క సారియైనా కాశీ యాత్రచేయవలెనన్న కోరిక తప్పకలుగును. సన్యాసులు మొదలుకొని మహారాజులు, రాణులు, తమ జీవితచివరి అంశము కాశీలో గడపవలెనన్న తీవ్ర తపనతో ఇచ్చోటికి వేంచెసెదరు. కాశీ మహానగరము పెద్ద పట్టణము. అనేకములైన పారిశ్రామిక స్థలములు విధ్యాసంస్థలు కాశీ విశ్వవిధ్యాలయము మొ॥ అనేక పురాతన మరియు నూతన మందిరములు, హోటళ్ళు, ధర్మశాలలుతో విరాజిల్లు చున్నవి. ఇచ్చట ఆంధ్రులు,

ధర్మశాల (ఆంధ్రాశ్రమము) శ్రీశైలకరిమెల బ్రాహ్మణసత్రము దక్షిణ భారత దేశహోటళ్లువున్నవి. అన్ని సౌకర్యములు గలనగరము.

స్వామి వారి ఆలయము దగ్గర రోడ్లు చాలా యిరుకైనవి. గంగాదిలో స్నానము చేసి శ్రీవిశ్వేశ్వర స్వామి వారి దర్శనమునకు వచ్చునపుడు అనేకమంది 'పండాలు' వెంటబడి పూజలు చేయించెదమని వేధించెదరు. వారిని వదలించుకొనుట మంచిది. లేనిచో చాలా డబ్బు మనవద్దనుండి గుంజెదరు. స్వామి వారి ఆలయము లోపల బయట కూడా అనేక గోవులు తిరుగుచుండును. జన సమ్మర్దము ఎక్కువగా వుండి నడచుట కూడా కష్టము అనిపించును. శ్రీ విశ్వేశ్వరస్వామి ఆలయములో ఎవరికి వారు పూజలు చేసికొనవచ్చును. స్వామి వారి జ్యోతిర్లింగము ఆలయము మధ్యభాగములో నుండక గర్భగుడిలో ఈశాన్య భాగములో ఒకటిన్నర అడుగు గోతిలోనున్నది. ఆ గోయి 4 అడుగులు పొడవు అంతే వెడల్పు తోనుండును. అభిషేకము చేసిన గంగాజలము ఎల్లప్పుడు నిండి యుండును. మనము తోసికొని వెళ్లిన గంగాజలముతో అభిషేకము చేయవలయును. రామేశ్వరము నుండి తెచ్చిన పుణ్యతీర్థమును స్వామివారిపై అభిషేకము చేయవలయును. రద్దీ ఎక్కువగా నుండును. గనుక కార్యక్రమమును త్వర త్వరగా ముగించవలయును. తరువాత ప్రక్కగా నుల్చుండి స్వామిని మనసార స్మరిస్తూ దర్శించుకొనవలసినది.

శ్రీ స్వామి వారి దర్శనానంతరము ఆలయప్రాంగణములో ఒక నూతిలో నున్న లింగమును దర్శించవలసినది. కొందరు ఇదియే అసలైన విశ్వేశ్వర జ్యోతిర్లింగమందురు. కాని అది నమ్మవలసిన అవసరము లేదు. అయినప్పటకి అనూతిలోనున్న లింగరాజును దర్శించి నమస్కరించవలసినది. ఆలయ గోపురము బంగారము రేకుతో కప్పబడినది. స్వామి వారి ఆలయమునకు 30 - 35 గజముల దూరములో మాతా అన్నపూర్ణేశ్వరి ఆలయమున్నది. ఇది చాలా చిన్న ఆలయము. ఎవరినైనా అడిగితే దారి చూపించెదరు. అటులనే విశాలాక్షీ అమ్మవారి దర్శనముకూడా చేసికొనవలసినది. కొందరు అన్నపూర్ణాదేవియే కాశీవిశాలాక్షి అందురు. కాని ఇరువురువేరువేరు ప్రదేశములలో నెలకొని యున్నారు. వారిని తప్పక దర్శనము చేసి కొనవలసినది. స్వామి వారిఆలయము అనేక పర్యాయములు మహమ్మదీయుల దండయాత్రకులోనై భిన్నమైనది.. అయినను ఎప్పటికప్పటికి తిరిగి నిర్మించబడుచుండెడిది. ప్రస్తుతమున్న ఆలయము ఇందూరు మహారాణి ఐన రాణీ అహల్యాబాయి తిరిగి నిర్మించిందినది. ఈ కాశీ యాత్రలో ముఖ్యముగా 'గౌడియమ్మ'

అనబడే శ్రీ శివదేవుని సహోదరి మందిరమును తప్పక దర్శించవలెను. అప్పుడుగాని విశ్వేశ్వరుడు తృప్తి నొందడంటారు. ఈ మందిరము ఎవరినైనా అడిగి దారి తెలిసికొనుట మంచిది. ఈ అమ్మవారిని గవ్వలతో పూజించెదరు గవ్వలు మందిరము దగ్గర దొరకును. అట్లే కాలభైరవుని కూడ తప్పక దర్శించవలయును. కాలభైరువుడు శునకవాహనుడై క్షేత్రపాలకుడుగా ప్రశిద్ధిపొందియున్నారు.

గంగానది ఇచ్చట ఉత్తర వాహినియై ప్రవహించుచున్నది. మొత్తము 64 ఘాట్‌లతో గంగానది కాశీలో విరాజిల్లుచున్నది. కాని వాటిలో ముఖ్యమైనవి 1. అసిఘాట్ 2. ధశాశ్వమేధ ఘాట్ 3. బర్లసంగమ్ 4. పంచగంగ 5. మణి కర్ణికా ఘాట్ మొదలైనవి. ఇవిగాకుండా ఆనందమయి ఘాట్ - నిర్వాని అఖాడా (నా గదిగంబర సాధువులుంటారు) హరిశ్చంద్రఘాట్ - కేదారఘాట్ ఇంకనూ అనేక ఘట్టములున్నవి.

1. దుర్గాలయము 2. తులసీమానసాలయము 3. భారత మాత ఆలయము 4. మాలవ్యాబ్రిడ్జ్ 5. బెనారస్ హిందూయూనివర్శిటీ 6. అమృతకుండము.

ఇవన్నీ వేరు వేరు ప్రదేశములలో నున్నందున, మనము ఒక గైడును తీసుకొనిన మంచిది. అతడే అన్ని ప్రదేశములను చూపుచు స్థలవిశేషములు చెబుతాడు. గైడాతో ముందుగానే ఎంతతీసికొంటాడో మాట్లాడుకొనవలసినది.

కాశీలో గంగానదిలోని జలమును ఒక పాత్రములోనగాని ప్లాస్టిక్ డబ్బాలోగాని నింపుకొని వెంటతీసికొని వెళ్ళవలసినది. అదే జలమును తిరిగి రామేశ్వరములో రామనాధ స్వామికి అభిషేకము చేసినచో కాశీయాత్ర సంపూర్ణమగును.



విశ్వేశ్వర జ్యోతిర్లింగము

**స్థలపురాణము :**

ప్రకృతి పురుషులు తమ తల్లి తండ్రులగు మాయా మహేశ్వరు (శివశక్తులు)లను చిరకాలము కాంచనందున "మీ మెచ్చట జన్మించితిమి, మాకర్తమ్యము ఏది" అని విచారించుచుండగా శ్రీ శివదేవుని నుండి "తపంబుచేయుడు" అన్న సందేశము వచ్చేను. ఎటుచూచినను ఐదు క్రోసుల నేలను సృష్టించి అందుండి తపస్సు చేయుడన్న సందేశ ప్రకారము కాశీపట్టణము నిర్మితమయ్యెను. శ్రీ శివదేవుడు తానును లింగరూపము ధరించి విశ్వేశ్వరనామధేయముతో కాశీ పురములో స్థిరవాసముజ్యోతిర్లింగ రూపమున విరాజిల్లుచుండెను. ప్రళయకాలమున కూడ ప్రపంచమంతయున శాబినను కాశిని మాత్రము శ్రీ శివదేవుడు తన త్రిషూలముపైకి ఎత్తి పట్టుకొని రక్షించుచుండెను. కనుక కాశీ పట్టణము అనినాశి అయ్యెను.

శ్రీ విష్ణు దేవుడు బ్రహ్మదేవుడు ఈ కాశీ పట్టణములో తపము చేయుచుండిరి. అపుడు విష్ణుదేవుని చమట బిందువు ఒకటి క్రిందపడి దిగుడు భావి అయ్యెను. అది చూచి శ్రీ శివదేవుడు ఆశ్చర్యముతో తలపంకించగా ఆ దేవదేవుని కర్ణమణి కుండలము ఒకటి క్రిందపడెను. అప్పటినుండి ఆ ప్రదేశము మణికర్ణికా తీర్థముగా ప్రశిద్ధిగాంచెను. అందు స్నానముచేసి కాశీవిశ్వేశ్వరుని దర్శించి ఆరాధించిన కైలాసమార్గము సుగమమగును.
శ్రీ విష్ణు దేవుని నాభినుండి జనించిన పద్మమునందు పుట్టిన బ్రహ్మదేవుడు పది అశ్వమేధములు బనరించి దశాశ్వమేధ లింగమును ప్రతిష్టించెను. తదుపరి దేవతలు ఋషులు కాశీయందు అనేక లింగములను ప్రతిష్టించిరి.

పరమాత్మ సదాశివుడు స్వయముగా స్థాపించి ఈ క్షేత్రమును విడువ కుండునందున స్వామి వారికి అని ముక్తేశ్వరుడని ప్రసిద్ధినొందిరి. కాశీ క్షేత్రమున మరణించిన పశుపక్షి కీటకమానవులకు, పునర్జన్మ రహిత శాశ్వత శివసాయుధ్యము కల్గును.

కాశీ యందు మరణమునకు జ్ఞానముగాని, భక్తిగాని, కర్మ - దానము - సంస్కారము - ధ్యానము - నామస్మరణము గాని పూజగాని అవుసరము లేదు.

కాశీ క్షేత్రమును అభివర్ణించటము అంటే సూర్యభగవానునికి దివిటీ చూపించటమే.

# బైద్యనాద్ జ్యోతిర్లింగ దర్శనానికి పయనము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ?ణాశి | — | మొహంటా (Mohanta ) | (N.H. 2) | — | 64 |
| ?హంటా | — | ససారామ్ (sasaram) | (N.H.2) | — | 48 |
| ?రమ్ | — | డెహరీ (Dehri) | (N.H.2) | — | 18 |
| ?రీ | — | ఔరంగాబాద్ (Aurangabad) | " | — | 27 |
| ?ంగాబాద్ | — | షేర్‌ఘాటీ (Sherghati) | " | — | 47 |
| ?ఘాటీ | — | చౌపారన్ (Khauparan) | " | — | 53 |
| ?పారన్ | — | బార్హి (Barhi) | " | — | 21 |
| ?ర్హి | — | బగోడర్ (Bagodar) | " | — | 51 |
| ?డర్ | — | ధుమ్రీ | " | — | 21 |
| ?మ్రీ | — | ధన్‌బాద్ (Dumari) (Dhanbad) | " | — | 74 |
| ?బాద్ | — | చిత్తరంజన్ (Chittaranjan) | " | — | 65 |
| ?త్తరంజన్ | — | మధుపూర్ (Madhupur) | " | — | 30 |
| ?ధుపూర్ | — | బైద్యనాద్ | " | — | 16 |
| | | | షుమారు | — | 54 |



బైద్యనాధ్ జ్యోతిర్లింగము

బైద్యనాద జ్యోతిర్లింగము. బైద్యనాద్ అనే చిన్న పట్టణములోనున్న మహోన్నతమైన శైవాలయము. భక్త జనసందోహము అన్ని కాలములలో బాగావుండును. బైద్యనాద్ ధామ్‌క్టేషన్ దేవ్‌ఘర్ అనియు అందురు.

బైద్యనాద్‌లో షుమారుగా 20 పేరుపొందిన ఆలయములున్నవి. అందులో ముఖ్యమైనది బైద్యనాథ జ్యోతిర్లింగము ముఖ్యమైనది. జ్యోతిర్లింగము షుమారు 12 అంగుళములు వెడల్పు పొడగులో గుంటగా వాలుగా నుండును. జ్యోతిర్లింగము శిరస్సుపై నున్న నొక్కును రావణుని బ్రొటనవేలు నొక్కు అందురు. అభిషేకము చేయుట కొరకు లక్షలాది భక్తులు వచ్చెదరు. ఆలయ ప్రాంగణములో చాలా గోపురశిఖరములున్నవి. ఈ గోపురశిఖరములను చుట్టూ ప్రహరీ గోడవున్నది. స్వామివారి గర్భాలయము షుమారుగా పెద్దదే. స్వామిని తాకి మనము పూజలు చేసికొనవచ్చును. ఫొటోలు కూడ తీసికొనవచ్చును. చాలామంది పండాలు వుందురు. వారు మనకు కావలసిన పూజలు చేసెదరు.

ఇచ్చట చాలా ధర్మశాలలున్నవి. అట్లే లాడ్జీలు వున్నవి. సౌకర్యములు ఫరవాలేదనిపించును. ఇచ్చటి జలవాయువు. శివగంగ స్నానము కుష్టురోగములను పొగొట్టునని నమ్మకము. మహా శివరాత్రినాడు ఆలయప్రాంగణములోనున్న అన్ని గోపురములను కలుపుచు దీపాలంకరణ చేయుదురు. ఇది చూడవలసినదే కాని వర్ణింపనలవి కాదు.

ఇచ్చట ముఖ్యముగా 1) బైద్యనాథ స్వామి ఆలయము 2) శివగంగ ఆలయము 3) భగవతీ జగదంబ 4) బైజ భక్త మందిరములు తప్పక దర్శించదగిన ఆలయములు.

**స్థలపురాణము :**

పూర్వము రావణ బ్రహ్మ శ్రీ శివదేవుని కైలాస పర్వతమున ఆరాధించుచుండెను. శ్రీ శివదేవుని ప్రత్యక్షముకొరకు. అనేక కఠిన నియమములతో తపము చేసిననుస్వామి ప్రత్యక్షముకాలేదు. ఒక వృక్షము క్రింద అగ్ని గుండము ఏర్పరచి పార్థవ లింగమును ప్రతిష్టించి శివపంచాక్షరీమంత్రముతో హవన కార్యక్రమముతో నిష్టతో చేసినను శ్రీ శివదేవుడు కరుణించలేదు. అపుడు రావణాసురుడు ఆ అగ్నిగుండములో తన 9 తలలను ఒక్కొక్క దానిని ఖండించి హవనము చేసెను. అయినను శ్రీ శివదేవుడు ప్రత్యక్షము కాలేదు. చివరకు తన 10వ తలను ఖండించుటకు సిద్ధమవగా శ్రీ శివదేవడు ప్రత్యక్షమై రావణుని 9 తలనను తిరిగి ప్రసాదించి, వాని కోరిక ప్రకారము అసమానమైన బలము నొసగెను.

స్వామిని రావణుడు తనలంకానగరమునకు రమ్మని ప్రార్థించగా స్వామి రావణనికి తన దివ్వ మహత్తు గల లింగమును ప్రసాదించి లంకానగరమునకు తీసికొని వెళ్లమని చెప్పి, తన తిరుగు ప్రయాణములో లింగమును భూమికి తాకించిన అచటనే స్థిరపడునని హెచ్చరించెను. కాని రావణబ్రహ్మ లంకానగరమునకు తిరుగు ప్రయాణములో లఘుశంకనిమిత్తము ఆ దివ్య లింగమును ఒక గోపబాలునకు యిచ్చి పట్టుకొనమనగా ఆ బాలుడు ఆ దివ్య లింగమును చితా క్షేత్రమున (స్మశాసనము) వుంచెను. ఇంక ఆ లింగము అచ్చటనే స్థిరమైనది. రావణుడు తన శక్తి నంతవుపయోగించినను కదలించలేకపోయెను. ఆవిధముగా బైద్యనాధేశ్వరుడు లంకానగరము నగాక భార తదేశములోనే జ్యోతిర్లింగ రూపమున భక్తుల అభీష్టమును తీర్చుచుండెను. రావణబ్రహ్మ ఆజ్యోతిర్లింగమును అచటనే అర్చించి తనలంకా నగరమునకుజనెను.

తదుపరి సర్వదేవతలు ఆ చితాభూమికి ఏ తెంచి పూజాప్రార్థన కార్యాక్రమముల చేసి జ్యోతిర్లింగమును అర్చించిరి. భవరోగములనునెల్ల నశింపజేయ సమర్ధముతో వైద్యనాదుడను పేరు సార్ధకనామమెనర్చుకొనెను.

## శ్రీ కేదారేశ్వరజ్యోతిర్లింగ దర్శనము

| | | |
|---|---|---|
| 1. బైద్యనాద్ | మధుపూర్ | 16 K.M |
| 2. మధుపూర్ | చిత్తరంజన్ | 30 K.M |
| 3. చిత్తరంజన్ | ధన్‌బాద్ (Dhanbad) | 65 K.M |
| 4. ధన్‌బాద్ | బార్హి (Barhi) | 146 K.M |
| 5. బార్హీ | ఔరంగాబాద్ (Aurangabad) | 121 K.M |
| 6. ఔరంగాబాద్ | వారణాశి (Varanasi) | 172 K.M |
| 7. వారణాశి | జాన్‌పూర్ (Jaunpur) | 60 K.M |
| 8. జాన్‌పూర్ | సుల్తాన్‌పూర్ (Sultanpur) | 80 K.M |
| 9. సుల్తాన్‌పూర్ | లక్నో (lucknow) | 137 K.M |
| 10. లక్నో | సిదౌలీ (sidhauli) | N.H 47 K.M |
| 11. సిదౌలీ | సీతాపూర్ (Sitapur) | N.H 37 K.M |

| | | | |
|---|---|---|---|
| 12. సీతాపూర్ | షాజహాన్‌పూర్ | | N.H 84 K.M |
| 13. షాజహాన్‌పూర్ | మీరాన్‌పూర్ (Miranpur) | | N.H 32 K.M |
| 14. మీరాన్‌పూర్ | బరేలీ (Bareli) | | N.H 44 K.M |
| 15. బరేలీ | రామ్‌పూర్ (Rampur) | | N.H 66 K.M |
| 16. రాంపూర్ | మొరాదాబాద్ (Moradabad) | | N.H 26 K.M |
| 17. మొరాదాబాద్ | నగీనా (Nagina) | | S.H76 K.M |
| 18. నగీనా | నజీబాబాద్ (Najibabad) | | S.H35 K.M |
| 19. నజీబాబాద్ | కోట్‌ద్వారా (kotidwara) | | S.H 26 K.M |
| 20. కోట్‌ద్వారా | హరద్వార్ (Hardwar) | | S.H40 K.M |

హరద్వార్‌జేరిన తరువాత ఒక దినములో వీలైన హరద్వార్ ఋషీకేష్ క్షేత్రములను దర్శించవలసినది. తరుపరి కారు మీదగాని Van మీదగాని మనము Drive చేయకుండుట మంచిది. కేదారినాద్ క్షేత్రమునకు మనము Car ను తోలుట మంచిది కాదు. ఆపర్వతములలో నున్నరోడ్లలోచాలా అనుభవమున్న అచ్చటివారు మాత్రమే Car గాని Vanగాని తోలగలరు. మనకారును లేదా Vanను ఏదైన ధర్మశాలలో నుంచి (ధర్మశాలవారికి కొంతడబ్బు కట్టవలెను హర్‌కిపీడీ (HAR - KI- PIDI) కి వెళ్ళుదారిలో ఘోరన్‌నాథ్‌జీ ధర్మశాల వున్నది. అందులో ఒక రూము తీసికొని మన Carను అక్కడే Park చేసికొని Taxi లేదా Bus, Car కేదార్‌నాద్ క్షేత్రానికి ప్రయాణించవలయును. ఘోరక్‌నాద్‌జీ ధర్మశాలమాదిరిగా చాలా ధర్మశాలలు హరద్వార్ - ఋషీకేష్‌లోన్నువి. ఆ ఆశ్రమమువారిని అడిగిన వారు Taxi మాట్లాడిపెట్టుదరు. సామాన్యముగా యాత్రకులు ఎక్కుగా వుంటే చార్జీ కొంచెము ఎక్కువ అగును. సామాన్యముగా Taxi వారు కేదారినాద్ బద్రీనాద్‌కు కలిపివచ్చెదరు. మనము కేదారినాద్‌వరకు వెళ్ళుతాము కనుక బద్రీనాద్ దర్శించుటమంచిది. మరల అవకాశము వచ్చునోరాదో కనుక బదరీనాద్‌ను కూడా దర్శించుటమన అదృష్టము.

మనము బస్సులో వెళ్లవలెనన్న హరద్వార్ నుండి ఋషీకేష్ నుండి బస్సులుండును. అన్ని Buses ఉదయమే బయలుదేరును. కనుక ముందుగా Bus Tickets Reserve చేసికొనుట మంచిది.

కేదారినాద్ బదరీనాద్ ఆలయములు దీపావళీ మరుసటి రోజున మూసి వుంచెదరు. తరుపరి ఏప్రిల్ ఆఖరి వారము లేదా మే నెల మొదటి వారములో తిరిగి తెరచెదరు. ఈ

విషయమును జ్ఞాపకము వుంచుకొని విజయవాడలో జ్యోతిర్లింగ యాత్ర ప్రారంబించుట మంచిది. యాత్రను మార్చి నెలలోగాని ఏప్రిల్ మొదటి వారములో ప్రారంభించుట మంచిది.

కేదారినాద్ బదరీనాద్ ఆలయమును మూసివేయునపుడు ఆలయములలో అఖండదీపములు వెలిగించెదరు. తిరిగి ఆరునెలల తరువాత ఆలయమును తెరచునప్పటికి ఆ అఖండ జ్యోతి వెలుగుచునేవుండును. ఆ జ్యోతిని దర్శించుటకు భక్తులు తహతహలాడెదరు., ఆలయములు తెరచిని మొదటి రెండువారములు రోడ్లు కొంతవరకు మంచుతోనుండును దానిని ఆర్మీ జవాను 'రోడ్లను ప్రయాణయోగ్యముగా చేసెదరు. ఆలయములు ఆరునెలలు మూసివుంచినప్పటికి కొందరు సాధువులు - భక్తులు - ఋషులు అచ్చటనే వుందురు. అంతామంచు మయముగా ఉన్నప్పటికి వీరు కట్టెలను మండించుచు ఆ వేడిమిలో స్వామి స్మరణము చేయుచు జీవితమును సాపల్యము చేసికొనుచున్నారు. ఈ ఆరునెలల కాలమునకు సరిపడ ఆహార పదార్థములను నిలువ వుంచు కొందురు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. హరధ్వార్ నుండి | —— దేవప్రయాగ | —— 92 K.M | — 472 మీటర్ల ఎత్తు |
| 2. దేవప్రయాగ | —— శ్రీనగర్ | —— 35 K.M | — 579 " |
| 3. శ్రీనగర్ | —— రుద్రప్రయాగ | —— 34 K.M | — 610 " |
| 4. రుద్రప్రయాగ | —— సొనెప్రయాగ | —— 74 K.M | — 1829 " |
| 5. సోనెప్రయాగ | —— గౌరీకుండ్ | —— 5 K.M | — 1928 " |

గౌరీకుండ్ నుండి నడచి గాని లేదా గుర్రములమీద కేదారినాద్ క్షేత్రమునకు చేరవలయును.

| | | | |
|---|---|---|---|
| 6. గైరీకుండ్ | —— రంభారా | —— 7 K.M | —— 2291 " |
| 7. రంభారా | —— గరూర్ బిట్టి | —— 4 K.M | —— 3629 " |
| 8. గరూర్‌బిట్టి | —— శ్రీకేదారినాద్ | —— 3 K.M | —— 35 83 |

గౌరీకుండ్ - కార్లు బస్సులు చేరుటకు చివరి మజలీ. శ్రీకేదారినాద్ క్షేత్రమునకు వెళ్లుటకుయిచ్చటి నుండి నడచి గాని గుర్రములమీద వెళ్లవలసి యున్నది. గౌరీకుండ్ గౌరీ మాతకు ఒక ఆలయమున్నది. పార్వతీమాత యిచ్చటనే తపస్సు చేసి శ్రీ శివదేవుని పతిగా పొందినది. ఇచటికి దగ్గరలోనున్న త్రయున్ నారాయణ్ అన్న ప్రదేశములో శ్రీ శివదేవునికి



కేదార్‌నాధ్ జ్యోతిర్లింగము

ార్వతీ మాతకు వివాహము జరిగినది. గౌరికుండులో అమ్మవారి ఆలయము దగ్గర డినీటి కుండమున్నది. భక్తులు స్నానానంతరము అమ్మవారి దర్శనము చేసికొందురు.

ముఖ్యముగా గమనించవలసిన విషయము ఏమంటే గౌరీకుండ్‌లో ఆరాత్రి వుండి రుసటి రోజు ఉదయమే బయలుదేరుట మంచిది. సామాన్యముగా కేదారినాద్ ళ్లుదారిలో సాయంత్రము వర్షము వచ్చుట జరుగుచుండును. వర్షము వచ్చినచో భక్తులు ాలా యిబ్బంది పడవచ్చును. అందుకనే ఉదయము బయలుదేరి సాయంత్రము 2 లేదా గంటలకు చేరవలసినది.

గౌరీకుండ్‌లో మంచి హోటళ్లు వసతి గృహాలు ధర్మశాలలున్నవి. కనుక రాత్రి ుండటకు యిబ్బంది వుండదు. గౌరీకుండ్ నుండి కేదారి నాద్‌కు గుర్రాల మీద ళ్లదలచినచో రానూ పోను మాట్లాడుకొనవచ్చును. కానీ కేదారినాద్‌లో ఒకటి రెండు ుజులుండదలచినచో ఒక్క పావుటకు మాత్రమే గుర్రమును మాట్లాడుకొనవలసినది. రిగి వచ్చుటకు కేదారినాద్‌లో గుర్రములు దొరుకును. మనము కేదారినాద్ జేరిన వెంటనే క రూము తీసుకొని సామాను అక్కడ పెట్టుకొని స్నానానంతరము కేదారీశ్వరస్వామితో లి ర్శనమునకు వెళ్లవలయును. మరుసటి దినము వుదయము మలిదర్శనము సికొనవలసినది. మన సామానులను గుర్రపు యజమాని తనతో మోసికొని వచ్చును.

ఎక్కువ సామానువున్నచో కూలిని మాట్లాడుకొన్నరానుపోను అతనే సామానులు మోస్తాడు. ప్రతికూలీకి లైసెన్స్ నంబరుండును.

కేదారినాద్‌లో సమాచార కేంద్రములో విచారించి రూములు ఏర్పాటు చేసికొనవచ్చును. ఇచ్చట చలి విపరీతముగానుండును. అప్పుడప్పుడు వర్షముకురియును అపుడు భరించలేని చలి వుండును. ఉన్ని వస్త్రములు, సాక్సు, గ్లోవ్స్ - టోపీలు వెంటవుంచుకొనుట మంచిది. ఇవి ఖరీదు చేయుటకు, కేదారినాధ్‌లోకూడ దొరకును. రజాయిలు అద్దెకు యిచ్చెదరు. వాటిని తీసికొని రాత్రిపూట కప్పుకోవలసింది. మరుసటి దినము వుదయం వేడి నీరు అమ్మెదరు. స్నానము చేసి స్వామివారిని మలిదర్శనము చేసికొనవలయును.

శ్రీ కేదారేశ్వరస్వామి ఆలయమును పాండవులు నిర్మించిదనియు ఆ తదుపరి ఆలయమును శ్రీ ఆదిశంకరాచార్యుల కాలములో తిరగి నిర్మించిరందురు. శ్రీ ఆదిశంకరాచార్యులవారు భైతిక కాయమును కేదారినాద్‌లో త్యజించి ఆత్మజ్యోతి రూపములో స్వామి కైలాసమునకు యేగిరి. ఇచట శ్రీశంకరాచార్యులు వారి సమాధి కలదు. తప్పక దర్శించవలసినది. కేదారీశ్వర స్వామివారి ఆలయమునకు వెనుకగా షుమారు 200 గజముల దూరములో చిన్న మందిర రూపములో నున్నది ఆ సమాది.

స్వామివారు ఎద్దు మూపురము ఆకారములో అతి చిన్న పర్వత రూపముతో సాలిగ్రామశిలగా వెలసినారు. నందీశ్వరుని విగ్రహము అతి పురాతనమైనది. ఆలయములో పాండవుల విగ్రహములున్నవి. స్వామివారిని పండ్లుపూలు అగరబత్తీలు మరియు ఆవునేతితో పూజించెదరు. స్వామిని తాకవచ్చును. స్వామివారి ఆలయమునకు ప్రక్కగా వేరొక ఆలయమున్నది. అందులో కూడ కేదారేశ్వరుని పోలిన చిన్న సైజు సాలిగ్రామలింగమున్నది. కాని అచట పూజాకార్యక్రమములు చాలా తక్కువగా జరుగును.

ఇంకనూ కేదారినాద్‌లో దర్శించవలసిన ప్రదేశములు (1) శ్రీ కేదాశ్వరుని మందిరము 2. శ్రీ ఆదిశంకరాచార్యుల సమాధి (3) శ్రీ భైరవ శిల (4) భీముని గుహ (5) మధుగంగ (6) వాసుకీతలాబ్ (7) క్షీర్‌గంగ. ఇవి అన్నీ దర్శించవలెనన్న కనీసము రెండు రోజులు ఆక్షేత్రములో వుండవలసినది.

ఇక్కడ మందాకినీ నది చాలా వేగముగా ప్రవహించుచుండును. కేదారినాద్ లోనున్నంతకాలము మనమనస్సు ప్రశాంతముగాను భక్తితత్పరతతో జీవితములో ఏదో

సాధించిన తృప్తితో నుండును. శ్రీకేదారేశ్వరుని దర్శనము మనకు కైలాస ప్రాప్తికి కావలసిన సోపానములు ఎక్కినట్లు. స్వామివారిని దర్శించిన ప్రతిమానవుని జీవితము ధన్యమైనట్లే. ఈ విధముగా 12 జ్యోతిర్లింగ దర్శనము పూర్తియగును. జీవితము ధన్యమగును. ఎన్నో జన్మల పుణ్యఫలమో ఈ 12 జ్యోతిర్లింగ దర్శనము.

శ్రీ కేదారినాద్ నుండి తిరిగి బస్ అయిన కారు (Taxi) అయిన దానిలో తిరిగి హారిద్వార్ జేరవలయును. అచ్చటవుంచిన కారు లేదా Van ను తీసికొని ఇంటికి అనగామన ఆంధ్ర దేశములోనున్న స్వగ్రామమునకు ప్రయాణము మొదలుపెట్టువలయును.

హరిద్వార్ నుండి ——— న్యూడిల్లీ

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | హరిద్వార్ | ——— | రూర్కి | ——— | 32 K.M |
| 2. | రూర్కి | ——— | మజుఫర్‌నగర్ | ——— | 51 K.M |
| 3. | మజుఫర్‌నగర్ | ——— | మీరట్ | ——— | 65 K.M |
| 4. | మీరట్ | ——— | ఘజియాబాద్ | ——— | 47 K.M |
| 5. | ఘజియాబాద్ | ——— | న్యూఢిల్లీ | ——— | 19 K.M |

న్యూఢిల్లీ నుండి National Highway మీద ప్రయాణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 6. | New Delhi | ——— | మధురా (Mathura) | ——— | 147 K.M |
| 7. | మధురా | ——— | ఆగ్రా | ——— | 54 K.M |
| 8. | ఆగ్రా | ——— | ధౌల్‌పూర్ (Dhawlpur) | ——— | 56 K.M |
| 9. | ధౌల్‌పూర్ | ——— | గ్వాలియర్ | ——— | 64 K.M |
| 10. | గ్వాలియర్ | ——— | ఝూన్సీ (Jhansi) | ——— | 103 K.M |

**(డ్రాభ్రా - దాటియా** Dhbra & Datia) **మీదుగా**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 11. | ఝూన్సీ | ——— | లలిత్‌పూర్ | ——— | 92 K.M |
| 12. | లలితపూర్ | ——— | సాగర్ | ——— | 106 K.M |

| | | | |
|---|---|---|---|
| 13. | సాగర్ ——— | నరశింహపూర్ ——— | 120 K.M |
| 14. | నరశింహపూర్ ——— | లాఖన్‌దాస్ ——— | 51 K.M |
| 15. | లాఖన్ దాన్ ——— | సియోనీ ——— | 61 K.M |
| 16. | సియోనీ ——— | నాగపూర్ ——— | 121 K.M |
| 17. | నాగపూర్ ——— | ఆదిలాబాద్ ——— | 180 K.M(షుమారు) |
| 18. | ఆదిలాబాద్ ——— | డిఛ్‌పల్లి ——— | 139 K.M |
| 19. | డిచ్‌పల్లి ——— | హైద్రాబాద్ ——— | 160 K .M |
| 20. | హైదరాబాద్ ——— | విజయవాడ ——— | 272 K.M |

**మొత్తము ప్రయాణము షుమార 9000 కిలోమీటర్లు వుండును ఇది కారు లేదా Van ప్రయాణము**

అందరూ కార్లు Vans మీద ప్రయాణము చేయలేకపోవచ్చును. లేదా ఒకే పర్యాయము సమయము వెచ్చించ లేకపోవచ్చును. అందువలన వారికి వీలుగా 12 జ్యోతిర్లింగాలను వీలు కలిగినపుడు దర్శించుటకు వీలుగా రైలు - బస్సు ప్రయాణసౌలభ్యము క్రింద వివరణముగా అందించుచున్నారు.

1. **శ్రీశైలము :** అన్ని పట్టణ ప్రదేశముల నుండి Bus సౌకర్యములు కలవు. రైలుమీద రావలెనన్న కర్నూలు వరకు ఎటువైపునుండి అయినా వచ్చి అచ్చటనుండి Bus లో శ్రీశైలమురావలసియుండును. అట్లే మార్కాపురము వరకు రైలులో వచ్చి అచ్చటనుండి Busలో రావలసియుండును. అన్ని కాలములలో యాత్రచేయవచ్చును.

2. **రామేశ్వరము :** రైలులో మద్రాసు పట్టణమునకు చేరి, అచ్చటనుండి రామేశ్వరము రైలుస్టేషనుకు ఆటోలో గాని రిక్షాలోగాని వెళ్లి అచ్చటనుండి రామేశ్వరమునకు సరాసరి రైలు మీద వెళ్లవచ్చును. అట్లే రామేశ్వరమునకు అన్ని పట్టణముల నుండి బస్ సౌకర్యముల కలదు. (మద్రాసు రాష్ట్రములోని అన్ని పట్టణములో) అన్ని కాలములలో యాత్ర చేయవచ్చును.

3. **ఘృష్ణేశ్వర్ : త్రయంబకేశ్వర్ - భీమాశంకరజ్యోతిర్లింగములు :** ఈమూడు జ్యోతిర్లింగములు మహారాష్ట్రములోనున్నవి. ఈ మూడు జ్యోతిర్లింగములను ఒకే పర్యాయము దర్శించిన సమయము డబ్బు కలిసివచ్చును. పుణనగరమునకు రైలులో

ప్రయాణించి అచటినుండి బస్సులో డాకిన్యాభీమశంకరం క్షేత్రమునకు వెళ్ళవచ్చును. భీమ శంకరం నుండి నాసిక్ వరకు బస్సులో ప్రయాణము చేసి అచటినుండి బస్సులో త్రయంబకేశ్వరం క్షేత్రానికి బస్సులో వెళ్లవలయును. త్రయంబకేశ్వరుని దర్శించిన తరువాత తిరగి నాసిక్ పట్టణమునకు వచ్చి అచ్చట నుండి ఔరంగాబాద్‌కు బస్సులో ప్రయాణము చేయవలసినది. ఔరంగాబాద్ నుండి ఘృష్ణేశ్వర్ క్షేత్రానికి బస్సులో ప్రయాణించవలసినది. ఘృష్ణేశ్వర్ దర్శనాంతరము తిరగి ఔరంగబాద్‌కు Busలో రావలయును. ఔరంగాబాద్‌నుండి హైదరాబాద్‌కు రైలులో గాని Busలో గాని రావలయును. హైదరాబాద్ నుండి స్వస్థానమును వెళ్లవచ్చును. ఈ క్షేత్రదర్శనము అన్ని కాలములలో చేయవచ్చును. నవంబరు, డిశంబరు, జనవరి మాసములలో చలి అధికముగా నుండును. కనుక తగు దుస్తులతో ప్రయాణము చేయవలసినది.

**3. సోమనాద్ - నాగేశ్వర్ (గుజరాత్ రాష్ట్రము)**

విజయవాడ హైదరాబాద్‌ల నుండి గుజరాత్‌లోని అహమ్మదాబాద్ నగరమునకు రైలులో ప్రయాణించి అచటినుండి విరావల్ వరకు రైలులో వెళ్ళవలయును. విరావల్ (Viraval) నుండి బస్సులో సోమనాద్ క్షేత్రమునకు వెళ్లవలయును. సోమనాద్ క్షేత్రదర్శనానంతరము ధ్వారకా పట్టణము వరకు బస్సులో వెళ్లి అచటనుండి దారుకావన్ నాగేశ్వర్ క్షేత్రమునకు బస్సులో ప్రయాణముచేసి తిరిగి రావలయును. అచటినుండి స్వస్థానమునకు వెళ్ళవలయును. నవంబరు, డిశంబరు జనవరి నెలలో చలి అధికముగానుండును. గనుక తగిన వస్త్రములతో ప్రయాణము చేయవలసినది. అన్నికాలములో యాత్రచేయవచ్చును.

**4. ఉజ్జయినీ - ఓంకారేశ్వర్ అమరేశ్వర్ : మధ్యప్రదేశ్ రాష్ట్రములోనున్నవి.**

హైద్రాబాద్ నుండి ఉజ్జయినీ నగరమునకు రైలుమీద ప్రయాణము చేసి (Direct Train) అచ్చట మహాకాళేశ్వర స్వామిని దర్శనము చేసికొని తిరిగి Bus మీద ఓంకారేశ్వర్‌కు రావలయును. అచ్చట ఓంకారేశ్వర్ అమలేశ్వరుని దర్శనం చేసికొని రైలులో హైదరాబాద్ తదుపరి స్వస్థానమునకు రావలసివుండును. ఈ క్షేత్రములదర్శనము అన్ని కాలములలో అనుకూలముగా నుండును.

**కాశీ** - బైద్యనాద్ (కాశీ ఉత్తరప్రదేశములోను బైద్యనాద్ బీహారులోనున్నది)

విజయవాడనుండి కాశీ (వారణాశి) (Benaras) కు Driect Train వున్నది. కనుక కాశీ క్షేత్రానికి రైలు మీద ప్రయాణము చేసి కాశీవిశ్వేశ్వరుని దర్శించి క్షేత్రదర్శనాంతరము. తిరిగిరైలులో మధుపూర్‌కు ప్రయాణముచేసి అచ్చటనుండి Busలో బైద్యనాద్ క్షేత్రము దర్శింపవలయును. బైద్యనాద్‌స్వామి దర్శనము తరువాత తిరగి కాశీ పట్టణమును రైలులో ప్రయాణించి అచటి నుండి విజయవాడకు రైలులో తిరగిరావచ్చును. తదుపరి స్వగ్రామమునకు. అన్నికాలములలో యాత్రచేయవచ్చును. ఆగష్టు - సెప్టెంబరు నెలలలో వరదలు వచ్చుచుండును. గనుక ఆరెండు మాసములు ప్రాయాణించకుండుట మంచిది.

**6. కేదారినాద్ :**

విజయవాడ - హైదరాబాద్‌లనుండి సరాసరి న్యూఢిల్లీకి రైలుమీద ప్రయాణించి అచటినుడి హరధ్వార్‌కు రైలు మీద ప్రయాణము చేయవలసినది. న్యూఢిల్లీ నుంచి బస్సుమీద (Inter state Bus Stand) కూడ హరధ్వార్‌కు ప్రయాణము చేయవచ్చును. హరధ్వార్ నుండి కేదార్ క్షేత్రానికి Bus మీద ప్రయాణము చేయవలయును. శ్రీకేదాశ్వరుని దర్శనానంతరము తిరిగి హరధ్వార్‌కు బస్సుమీద రావలయును. హరధ్వార్‌నుండి న్యూఢిల్లీకి రైలుమీదగాని Bus మీదగాని వచ్చి తిరిగి విజయవాడ - హైదరాబాద్‌లకు రైలు మీద రావలయును. తదుపరి స్వస్థానమునకు ప్రయాణించవలసినది.

మే (May) నెలనుండి సెప్టెంబరు (September) నెలలోనే ప్రయాణము చేయవలసి వున్నది. మిగిలిన నెలలలో హరధ్వార్ నుండి కేదారినాద్‌కు ప్రయాణము వుండదు. శ్రీకేదారీశ్వరుని దర్శనమునకు వెళ్లినపుడు బదరీనాద్ దర్శనము చేసికొని అచటనున్న బ్రహ్మకపాల స్థానములో మన మన వంశపు పూర్వులందరికి పిండప్రదానము చేసివారిని తరింపజేసి మనము తరించవచ్చును.

*ఓం నమోశ్శివ*

## మరికొన్ని శైవ క్షేత్రాలు

### రంగులు మారుతూ దర్శనమిచ్చే డాల్‌సర్ శివలింగం

వైజ్ఞానిక విశ్లేషణ మాట ఎలా ఉన్నా రోజుకు మూడుసార్లు మూడు రంగుల్లో దర్శనమిచ్చే ఆ శివలింగం ఆశ్చర్యానికి ఆటపట్టే! కాశ్మీర్‌లోని ఉధంపూర్ జిల్లాకు చెందిన రామ్‌నగర్ ప్రాంతంలోని డాల్‌సర్ గ్రామంలో అతి పురాతన శివాలయం ఈ అద్భుతానికి వేదికగా నిలుస్తోంది. ఇందులోని శివలింగం స్వయంభువని భక్తులు విశ్వసిస్తారు. ఒకే రోజులో మూడు వర్ణాలతో దర్శనమివ్వడం, ఇక్కడ వెలసిన దేవుడి మహత్తుకు నిదర్శనమని భావిస్తారు. ఈ అద్భుతాన్ని చూడడానికి తండోపతండాలుగా తరలివచ్చేవాళ్లలో హేతువాదులూ, విజ్ఞానశాస్త్రవేత్తలూ ఉన్నారు. చూస్తుండగానే ఒక రంగులోంచి మరో రంగులోకి మారిపోయే శివలింగం తాలూకు ఆకర్షణను, ఏ విశ్లేషణలూ తగ్గించలేక పోవడం విశేషం.

### ప్రత్యేక వైఖరి

ఉధంపూర్ జిల్లాలో అనేక దేవాలయాలున్నాయి. వాటిలో,కొన్ని చరిత్రతో ముడిపడి ఉన్నాయి. అయితే డాల్‌సర్‌లోని శివాలయం మాత్రం ప్రత్యేకమైందనే చెప్పాలి. ‍మర్‌నాథ్‌లోని హిమలింగానికి ఎంత ఖ్యాతి ఉందో ఇక్కడ వివిధ వర్ణాలతో దర్శనమిచ్చే ంగా కృతికీ అంతే ప్రఖ్యాతి ఉంది. దేవుడి రంగుల మార్పిడిలోనే కాదు..... దేవాలయ ర్మాణంలోనూ మూడు దశలు ఉండటం మరో విశేషం. రామ్‌నగర్ ప్రాంతాన్ని పాలించిన ంద్రాల్ రాజవంశీయులు శివభక్తులు కావటంతో, డాల్‌సర్‌తో తమ ఆరాధ్యదైవానికి ద్ధ ఆలయాన్ని నిర్మించారని చెప్తారు. వారి ఏలుబడి అంతరించిన తరువాత హఠాత్తుగా ంభవించిన భూకంపం వల్ల ఆలయం శిథిలావస్థకు చేరుకొంది. కొంతకాలం తరువాత ్థానిక భక్తులు, ఆచ్ఛాదన కరవైన శివునికి చిన్నదైన ఆశ్రమాన్ని నిర్మించారు.

### స్వయంభువు

నల్లని శిలతో రూపొందిన శివలింగాన్ని దగ్గర నుంచి దర్శిస్తే కళ్ళు, ముక్కు, చెవులూ ‌నిపిస్తాయి. అంతేకాదు తలపైన జటలు కూడా గోచరిస్తాయి. ఇవి లింగంతో పాటు

వెలిసినవే తప్ప శిల్పులు చెక్కినవి కావని స్థానికులు చెప్తారు. ఆలయ వెనుక భాగంలో పురాతన మందిరం తాలూకు శిథిలావశేషాలు కనిపిస్తాయి. ముఖ్యంగా అక్కడి స్తంభాలు, భూకంపానికి ముందు నిర్మితమైన ఆలయం చాలా పురాతనమైందనడానికి తార్కాణాలుగా నిలుస్తాయి. వాటిపైన నగిషీలు, అద్భుత శిల్ప కళా విన్యాసాలు కాశ్మీరీ పనితనాన్ని చెప్పక చెబుతాయి.

డాల్‌సర్‌లోని శివాలయానికి సంబంధించి ఓ కథ ప్రాచుర్యంలో ఉంది. బింద్రాల్ రాజ వంశీయులు ఆలయాన్ని నిర్మించక పూర్వం ఇక్కడ దట్టమైన అడవి ఉండేదని అంటారు. ఈ అడవిలోని రోజూ ఓ వృద్ధుడు తన ఆవుల్ని మేతకు తోలుకు వచ్చే వాడట. ఒక రోజు సాయంత్రం ఇంటికి చేరిన తరవాత మందలోని ఓ పాడి ఆవు దగ్గర ఎంత పితికినా పాలు రాకపోవడంతో వృద్ధుడు ఆశ్చర్యపోయాడట. అలా వరుసగా నాలుగైదు రోజులు జరగడంతో ఏదో మోసం ఉందని అనుమానించాడట. అడవిలో ఆవు మేసే సమయంలో ఎవరో దొంగతనంగా పాలు పిండుతున్నారని నిర్ధారించుకున్న వృద్ధుడు, అయిదో రోజున అడవిలో మాటు వేసి, తన ఆవును వెంబడించాడట. ఆ ఆవు పొదల్లోకి ప్రవేశించి ఒక చోట నిలబడగానే అప్రయత్నంగానే పొదుగు నుంచి క్షీరధారలు వర్షించడం వృద్ధుణ్ణి ఆశ్చర్యంలో ముంచెత్తిందట. పాలు ధారలు పట్టిన ప్రదేశంలో తవ్వి చూడగా అక్కడ కళ్ళు, ముక్కు, చెవులు, జటలతో ఉన్న నల్లని శివలింగం దర్శనమిచ్చిందనీ, మూడుసార్లు వివిధ వర్ణాలతో కనువిందు చేసే ఆ శివ సంకేతం అచిరకాలంలోనే ప్రాచుర్యాన్ని పొందిందనీ చెప్తారు. రామ్‌నగర్ ప్రాంతంలోని ఈ ఆలయాన్ని దర్శించడానికి ఏటా వేలాదిమంది భక్తులు డాల్‌సర్‌కు చేరుకుంటారు. శివరాత్రి ఇక్కడి విశేష పర్వదినం. ఈ సందర్భంగా అమర్‌నాథ్ యాత్రను స్ఫురింపజేసేలా ఛడీముబారక్ యాత్రను నిర్వహించడం భవహరుడు తనకు తానుగా వెలసిన ఈ క్షేత్ర విశేషం.

## మణిమహేశ్ యాత్ర

మణి మహేశ్.... హిమాలయాల్లో ఎత్తయిన పర్వతాల్లో ఒకటైన కైలాస పర్వతం ఒడిలో కొలువుతీరిన శైవక్షేత్రం! ఏకాంత సమయంలో శివుడు విడిది చేసే పవిత్ర ప్రదేశంగా

భక్తులు భావించే ఈ క్షేత్రం, వైష్ణవులకూ దర్శనీయ స్థలంగా పేరు తెచ్చుకొంది. ఏటా ఆగస్ట్ - సెప్టెంబర్ నెలల మధ్య కృష్ణాష్టమి మొదలుకొని పదిహేను రోజులపాటు వేలాది యాత్రికులు కైలాస పర్వతాన్ని అధిరోహించి మణిమహేశ్ చేరుకుంటారు. పవిత్ర జలావాసాలుగా విశ్వసించే ఇక్కడి కోనేళ్లలో స్నానాలు చేసి తమ భక్తిప్రపత్తుల్ని చాటుకొంటూ ఉంటారు.

## ఎలా వెళ్ళాలంటే .....

మణిమహేశ్ పుణ్యక్షేత్రం హిమాచల్ ప్రదేశ్‌లోని చంబా జిల్లాలో ఉంది. సముద్ర మట్టానికి 14,000 అడుగుల ఎత్తులో రయిల్‌హెడ్ పఠాన్‌కోట్ నించి 122 కిలోమీటర్ల దూరం ప్రయాణించి చంబా పట్టణానికి చేరే భక్తులు సాధారణంగా అక్కడ ఓ రాత్రి గడుపుతారు. తరవాత జీపులోనో, బస్సులోనో 72 కిలోమీటర్ల దూరం ప్రయాణం చేసి, 'హడ్సర్' చేరుకుంటారు. దారిపొడవునా ఫారెస్ట్, పి.డబ్ల్యు.డి. విశ్రాంతి గృహాలున్నా, మమూలుగా యాత్రికులెవరూ వాటిని ఆశ్రయించరు. తీర్థయాత్ర చేస్తున్న అనుభూతిని కోల్పోకుండా ఉండేందుకన్నట్టు- రాత్రి సమయాల్లో ఏ ఆలయ ప్రాంగణంలోనో తలదాచుకుంటూ ముందుకు ప్రయాణం సాగిస్తారు. కొందరైతే మార్గమధ్యంలోని గ్రామీణుల ఇళ్లలోనే తాత్కాలిక అతిథులవుతారు. ఈ ప్రాంతీయ గ్రామీణుల్నే 'గద్దీ'లంటారు. గద్దీలు మణిమహేశ్ యాత్రికులకు ఆశ్రయం ఇవ్వడానికి వెనుదీయరు. శివదర్శనం చేసుకోవడానికి వెళ్తున్న భక్తకోటికి ఉడతాభక్తిగా సేవ చేయడాన్ని తమ ధర్మంగా భావిస్తారు వాళ్లు. తమ తాత్కాలిక అపరిచిత అతిథులకు ఉన్నంతలోనే నివాస, భోజన వసతులు కల్పించి నిండు హృదయంతో సహకరిస్తారు.

తరువాత యాత్రికులు హడ్సర్‌నించి 12 కిలోమీటర్లు సన్నటి ఎత్తయిన దారిలో ప్రయాణం చేయాలి. ఇటూ అటూ రకరకాల చెట్లూ మొక్కలతో అక్కడక్కడ రాతి, మంచు, కలప వంతెనలతో వింతగా కనిపించే ప్రకృతి మధ్య- బృందాలుగా చేరి, భగవద్ధ్యానం చేస్తూ పర్వతారోహణ చేయడం ఓ అద్భుతమైన అనుభూతి!' అంటారు భక్తులు.

## ప్రయాణంలో పదనిసలు

పర్వత ప్రాంతంలో అలా పైకి ఐదు కిలోమీటర్లు ఎక్కాక మొదటి మజిలి వస్తుంది. అదే దాంచో'! అలసిపోయిన భక్తుల సేద తీర్చేందుకు, వాళ్లకు ఉత్సాహం కలిగించేందుకు స్వచ్ఛందంగా సేవచేసే వ్యక్తులు కొందరు అక్కడ ఎదురు చూస్తుంటారు. భోజనం కావాలనుకునే వాళ్లకి భోజనం, భుక్తాయాసంతో పర్వతారోహణం కష్టమని భావించేవాళ్లకి టీ - ఇలా ఎవరి రుచుల్ని బట్టీ, అభిరుచుల్ని బట్టీ వాళ్లకవి ఉచితంగా సమకూర్చి లక్ష్యాన్ని - సుగమం చేస్తారు స్వచ్ఛంద సేవాబృందాల వాళ్లు.

ధాంచో దగ్గరే బందర్ ఘాట్‌నాలా' అనే జలపాతం ఉంది. ఇది మణిమహేశ్ సరస్సునుంచి ఉద్భవించిందే! దీంట్లో స్నానంచేస్తే ఆత్మోన్నతి కలుగుతుందనీ, పరమేశ్వరుడి ఆశీస్సులు లభిస్తాయనీ భక్తులంటారు. ధాంచో దాటి మరో మూడు కిలోమీటర్ల ఎత్తుకు ప్రయాణిస్తే గౌరీకుండ్' కనిపిస్తుంది. సౌభాగ్యదాయినిగా పేరుపొందిన ఈ కోనేటిలో స్నానం చేయడానికి స్త్రీలు ఆసక్తిచూపుతారు. మరి కాస్త పైకి- రెండు కిలోమీటర్లు- ప్రయాణిస్తే గమ్యస్థానం చేరుకున్నట్టే .... అదే మణమహేశ్! అక్కడి కోనేటిలో అందరూ స్నానాలు చేయవచ్చు అయితే సాధుపురుషులంతా కృష్ణాష్టమి రోజున, సాధారణ యాత్రికులు రాధాష్టమి రోజున దీంట్లో స్నానం చేయాలనే సంప్రదాయం అనాదిగా వస్తోంది. ఇక్కడి నీళ్లు భరించలేనంత చల్లగా ఉంటాయి.

## ఆ పైకి వెళ్తే?

మణిమహేశ్ సరస్సును చేరుకోగానే యాత్ర ముగిసినట్టే. కానీ అంతదాకా పర్వతారోహణ చేస్తూ వస్తున్న యాత్రికులకి ఆ పైన ఏముందో చూడాలనిపించడం సహజం. అక్కడినించి కైలాస పర్వతం మరో మూడువేల అడుగుల ఎత్తుంది. పర్వతారోహణలో అనుభవం ఉన్నవాళ్లు అది ఎక్కడం సాధ్యమే కూడా! కానీ మణిమహేశ్‌ను దాటి మరింత ఎత్తుకు ప్రయాణించడం అక్కడ నిషిద్ధం. దేవతల నుంచీ, ప్రమథ గణాలనించీ దూరంగా, ఏకాంతంగా ఉండాలని అభిలషించినప్పుడు పరమ శివుడు ఈ కైలాస పర్వత శిఖరం

మీద విహారం చేసేందుకు వసుస్తంటాడనీ. అందువల్ల మానవులెవరూ పరిమితికి మించి శిఖరంవైపు పయనించకూడదని నియమం పెట్టాడనీ ఇక్కడి స్థలపురాణం చెబుతోంది.

శివుడి అజ్ఞను ధిక్కరించి శిఖరం దిశగా వెళ్తే ఏం జరుగుతుందన్న ప్రశ్నకు సమాధానంగా భక్తులు ఓ గాథను వినిపిస్తారు. గతంలో ఈ ప్రాంత నివాసి అయిన గద్ది ఒకడు, తన కుక్కతోనూ గొర్రెతోనూ కలిసి మణిమహేశ్ దాటి పైకి ప్రయాణం చేశాడనీ, కొద్దిసేపటికే వాటితో సహా రాయిగా మారిపోయాడనీ ఆ గాథ చెబుతుంది. వాళ్ళ కథనానికి ఆలంబనలుగా నిలిచే మనిషి, కుక్క, గొర్రె ఆకారాల్లోని మూడు శిలలు, మణిమహేశ్ సరస్సు దగ్గర్నించి తలపైకెత్తి చూస్తే కనిపిస్తాయి.

సౌందర్యం, సామరస్యం, అతులిత భక్తిభావం, అచంచల విశ్వాసం - అన్నిటినీ సమపాళ్ళలో నింపుకొన్న మణిమహేశ్ యాత్ర, హిమాలయ సుప్త నీహారికా సమూహాల మధ్య ఏటేటాచైతన్యం కలిగిస్తూనే ఉంటుంది.

*ఓం నమోశ్శివ*

